# పతితులసి.

# ఈ నాటకమున వచ్చు పాత్రలు.

---

## పురుషులు

బ్రహ్మ— సృష్టికర్త.

విష్ణుమూర్తి— వైకుంఠనాథుడు.

పరమేశ్వరుడు— కైలాసపతి.

ఇంద్రుడు— అమరవిభుడు.

జలంధరుడు— పరమేశ్వరుని కోపజ్వాలవలన జనించినవాడు, బృందకుం బతి.

మకరకుండలుడు— బృంద తండ్రి.

నారదుడు— దేవమౌని.

గాలవుడు— ముని.

## స్త్రీలు.

సతీదేవి— పరమేశ్వరుని భార్య.

లక్ష్మి— విష్ణుమూర్తి భార్య.

బృంద— జలంధరుని భార్య.

చారుమతి— గాలవుని భార్య.

# పీఠిక.

బైస్కోపు కంపెనీ (Bioscope Company) వారి ప్రదర్శనములలో "సతీతులసి బృందావనము" అను కథను జూచినప్పటినుండియు, దానిని నాటకముగా వ్రాయవలయునను కోరిక కలిగినది. దీనికిఁదోడు మిత్రులు కూడ నన్ననుదినమును సతీతులసి నాటకము వ్రాయవలసినదని తొందర పెట్టసాగిరి. కానీ, నేను దాని విషయమై తగిన శ్రద్ధఁబుచ్చుకొనక కాలయాపనము సేయుచుండ, నింతలో "సతీతులసి" నాటకమును గూర్చిన ప్రచురణ పత్రికలు (అనగా గ్రంథవిక్రయము నిమిత్తమై చేయఁబడినవి) రెండు మూడు నాకంటఁబడినవి. ఈనాటక రచనకైనన్నుఁ బ్రేరేచిన మిత్రులుగూడ వీనింజూచి, నీవు దీనిని నాటకముగ వ్రాయక యూరకుంటివి, చూడుము. ఎవరో ప్రకటించుచున్నారని పలికి వ్రాయనందుకు నన్ననేక నిష్ఠురములాడిరి. కాని, నేను వారికిఁదగిన సమాధానముఁజెప్పి, ఎవరో యొకరు వ్రాయుచుండిరి కదాయని యీయుద్యమమునుండి నాచిత్తము నొక్కింత మరలించితిని. ఇంతమాత్రముచేత నామిత్రులు నన్ను విడువలేదు. మరలనొకవిధమైన ప్రకటన పత్రికను నాచేతికిచ్చిరి. అందు, "బైస్కోపు ప్లాటు ననుసరించి వ్రాయబడినదనియు, తులసి దేవేంద్రుని గడగడ వడకించిన దనియు, మొదలుగాగల సంగతులతో నున్నది. బైస్కోపు ప్రదర్శనములో మొదటి నుంచియు, కథానాయిక తులసిగనే యున్నది. దీనిం గూర్చి కొంత విచారణము జేసి నాకేమరల నాటకము వ్రాయవలయునను తలంపు కలిగినది. అంతట తులసీదేవి వృత్తాంతమునకై ఆయా గ్రంథములు వెదకితిని. ఎక్కడఁజూచినను ప్రారంభమునుండియు, నెక్కడను తులసి, జలంధరునకు భార్యయైయున్నట్లుగాని, ఇంద్రుని తులసీదేవి వడకించినట్లుగాని గానిపించలేదు. నేను జూచినంతవఱకు, పురాణములందీక్రింద సంగతులున్నవి.

శ్లో॥ జలంధరస్య భార్యా భూద్బృందేతి భువి విశ్రుతా
పతివ్రతా వరారోహా భాయే వాను గతాపతిమ్।
జలంధరే ఘోరయుద్ధే రుద్రేణ వినిపాతితః
విష్ణుస్స ర్వకరణోప్యపి బృందాంద్రుష్ట్వా ముమోహసః॥
భర్తారం నిహతంజ్ఞాత్వా చిత్త్యగ్నౌ ప్రవివేశ సా।
శ్లో॥ అతీవ మోహం సంప్రాప్తో విష్ణుః బృందాజపస్సదా
బృందాశ్మశానే ప్రలపన్ దివారాత్రిం భ్రమాతురః
క్వాసి బృందే మాం విహాయ యుక్త్వాగతాసిను మధ్యమే
త్వాం వినాయాన జీవామి బృందే పశ్యముఖంమమ॥
ఇతి జల్పన్మహావిష్ణుశ్శ్మశానం నజహౌ చిరం॥
శ్లో॥ విష్ణోరభావా ద్వైకుంఠే హాహాకారో మహానభూత్
బ్రహ్మరుద్రాది దేవాశ్చచరిత్రం వైష్ణవం తదా
విచార్య విష్ణోస్సం మోహాజ్ఞాత్వా స్త్రీకృతమేవహి
ఇతినిశ్చిత్య బ్రహ్మాద్యాః స్త్రీజ్ఞానం స్త్రీయహాపయేత్
ఏవంతే గిరిజావాణి లక్ష్మీం ప్రార్థనే మాచరన్
ఇంద్రా ద్యాదేవతాస్సర్వే ప్రార్థయా మాసురంజసా।
శ్లో॥ వాణీతు ప్రార్థనాం కృత్వా బజమేకం దదావథ
యూయం బృందాశ్మశానేతు విష్ణోర్మోహాపను త్తయే।
రోపయధ్వం ప్రయత్నేన సఫలం భవతిధ్రువమ్
ఏతద్రోపణ మాత్రేణ కార్యసిద్ధిర్భవేదితి
దదావథత మాదాయ కైలాస మాగమస్సురాః
పార్వతీం ప్రాప్యదేవా స్తే ప్రార్థయా మాసురేవహి
పార్వతీ ప్రార్థనాం కృత్వా బీజమేకం దదౌ తథా
తతస్తులక్ష్మీం సంప్రాప్య ప్రార్థయా మాసురంజసా
లక్ష్మీరపి ప్రియా ప్రాదాద్బీజమేకం శుభోధనమ్॥
శ్లో॥ దేవా బీజాని సంగృహ్య విష్ణుర్యత్రా వతిష్ఠతే
శ్మశానే రోపయామా సుస్సించంతో సర్వవైర్జ్జలైః
భారత్యాదత్త బీజాద్వై బదరీవనసంభావనా
పార్వతీ దత్త బీజాత్తు తులసీ సంబభూవహ

లక్ష్మ్యా చేర్ష్యా వశాద్దత్త బీజాన్మాలత్య భూత్కిల
ఆత స్తన్మాధ వీపీరు త్సేవా యోగ్యాబ భూవహ
అత స్తత్తుల సీజన్మపార్వతీ తిహినిశ్చయ.॥

శ్లో॥ విశ్వేశ్వరః పార్వతీచ యత్రాస్తే తత్ర కేశవః
శివస్య హృదయం విష్ణుర్విష్ణోశ్చ హృదయంశివః
తులసీకాననం యత్రతత్ర సన్నిహితోహరిః॥

ఈ శ్లోకములను బట్టిచూడ జలంధరుని భార్య బృందయనియు, జలంధరుండు యుద్ధమున శివునిచేగూల, బృంద భర్తతో నగ్నిప్రవేశ మొనర్ప, బృందపై మోహమున విష్ణుమూర్తి బృందయొక్క శ్మశానమునఁ జరించుచుండ, దేవతలు లక్ష్మీ పార్వతీ సరస్వతుల వలన బీజములు గ్రహించి శ్మశానమున నాటిరనియు, పార్వతియిచ్చిన బీజము వలన తులసి మొలిచెననియుఁ దెలియుచున్నది.

ఈ స్వల్పగాథను నాధారముగాఁ జేసికొని ప్రధానకథకు భంగము రాకుండ "బైస్కోపు ప్లేటు"ను కూడ కొంతవఱకనుసరించి నాటకముగా వ్రాసితిని. బృందయొక్క జన్మవృత్తాంతముగాని, యామె తల్లిదండ్రుల నామములుగాని నేఁజూచినంతవఱకు లభింపలేదు. ఆకారణమున బృందతండ్రి పాత్రకు "మణికుండల" నామమిడితిని. జలంధరుని దుష్కృత్యములఁ జూపుటకై యొక మునిభార్య పాత్రను గల్పించితిని. ప్రధాన కథకు భంగముగాకుండ నిట్టి స్వాతంత్ర్యము బూనుట నాటకములయందు కవుల కాచారమే. ఐనను, నీవిషయములం గూర్చి యింకను బరిశోధించి, పునర్ముద్రణమందు సవరించుకొందును. ఇతివృత్తము స్వల్పముగానున్న యిట్టి కథను నాటకముగా వ్రాయుట బహుకష్టము. "చేయుటకంటె జెప్పుట చులకన" యను సామెత ననుసరించి, యేమియుఁ బనిలేక తీరుబడిగా గూర్చుండు మహనీయులు రసారసచర్చ నెంతయైనను జేయుదురు. అట్టివారికి మాత్రము నేనేమియుఁ జెప్పక, సదయహృదయుల కీనాటకము సమర్పించినాను. గుణాగుణము లరయు భారము వారికే విడిచిపెట్టితిని.

ఇట్లు,
గ్రంథకర్త.

# సతీతులసి.

## కథాసంగ్రహము

### ప్రథమాంకము.

రంగము 1:—తపోనిష్ఠనున్న ఆదిశక్తిని దర్శింపఁ దలఁచి ఇంద్రుఁడు వచ్చుటఁజూచి, యచ్చటనున్న పరమేశ్వరుఁడు ఇంద్రుని వారించుట. ఇంద్ర పరమేశ్వరుల సంవాదము. పరమేశ్వరు డాగ్రహమంది యింద్రునిని దగ్ధముసేయ నెంచుట. ఇంద్రుఁడు మహేశ్వరుని క్షమింపు వేఁడుకొనుట. పరమేశ్వరుఁడు తన మూఁడవ కన్నునుండి వెడలిన జ్వాలను సముద్రమునఁ బడునట్లు పారవేయుట.

రంగము 2:—పరమేశ్వరుఁడు విడిచిన జ్వాల శిశురూపమున సముద్రముపైఁ దేలియాడుచుండ సముద్రుఁడా బిడ్డను గైకొనుట. ఇంద్రుఁడు - పరమేశ్వరుఁడు - విష్ణుమూర్తియు, నాశిశువును జూడవచ్చుట. విష్ణుమూర్తి యాబిడ్డను నెత్తుకొని ముద్దాడుచుండ, నాశిశువు ఘోరరూపము ధరించి యాతనిం జంపఁబోవ విష్ణుఁడాతని మహిమనెంచ దేవతా ప్రార్థితుఁడై శాంతించుట. ఈశ్వరుఁ డాతనికి జలంధర నామమిడి వరంబులిచ్చుట.

### —* ద్వితీయాంకము. *—

రంగము 1:—బృంద తనగదింబున పుష్పహారము సేయుచుండ, నది జారి త్రొక్కఁబడినని కోపమున నామెను స్వీకరింపనని వచ్చుచున్న జలంధరుని నారదుఁడు శాంతపఱచి బృందఁ గైకొనునట్లు సమ్మతింపఁజేయుట. "మహాశికుంతలుఁడు" తన కూఁతురగు బృందను జలంధరున కిచ్చుట. జలంధరుఁడు బృందను నిజగృహమునకుఁ దోడ్కొని పోవుచు ననేకవిధముల దూషించుట.

రంగము 2:—వనమున విష్ణుమూర్తి బృంద సౌందర్యమునుగూర్చి తనలోఁ దాను తలపోయుట. బృంద వనవిహారమునకు వచ్చి జలంధరుని దుష్కృత్యములఁగూర్చి విచారించుట. విష్ణు

మూర్తి బృందను మోహించి యామెంజేరి తనయభీష్టము దెలు
పుట. బృంద విష్ణుమూర్తిని నిరాకరించి పలుకుట.

—* తృతీయాంకము. *—

రంగము 1:—అరణ్యమున గాలవుడను మునిపత్నియగు చారుమతి యాశ్రమమున నొంటరిగా నుండగా జలంధరుడు వచ్చి యనేక విధముల నామెతో భాషించుట. ఇంతలో నామె భర్త వచ్చుటం జూచి వెడలిపోవుట.

రంగము 2:—మందిరమున బృంద జలంధరునితో దుష్కృత్యముల సేయవలదనియు, బరాంగనలం జెఱంబట్టవలదనియుం బ్రార్థించుట. ఆసమయమున జలంధరునిచే నాజ్ఞాపింపంబడిన భటులు చారుమతిని బంధించుకొనివచ్చుట. బృంద జలంధరుని బ్రతిమాలి చారుమతిని విడిపించుట. నారదుండువచ్చి పార్వతీ విషయమై ప్రయత్నించుమని జలంధరునిం బ్రేరేచి వెడలుట. జలంధరుని యుద్యమ మెఱింగి, బృంద యాతని వారింపం బ్రయత్నించుట. బృంద మాటలు వినక జలంధరుండు కైలాసమున కేగుట.

—* చతుర్థాంకము. *—

రంగము 1:—జలంధరుండు కైలాసమున పరమేశ్వరుండు లేని సమయముజూచి సతీదేవిని బట్టంబోవంగా, బరమేశ్వరుండువచ్చి యాతని భస్మముసేయందలంచు సమయమున బృంద యరుదెంచి యాతని బతిభిక్షం బెట్టుమని ప్రార్థించుట.

రంగము 2:—జలంధరుండు తనభార్య యుండుటవలనం బరస్త్రీల బంధించుటకు వీలులేకుండ నుండెనని యామెను సముద్రమునం బడవేసిపోవుట. విష్ణుమూర్తి యామెను రక్షించి బృందావనమున నుంచుట.

రంగము 3:—ఇంద్రుండు మొదలయిన దేవతలు విష్ణుమూర్తి సన్నిధి కరిగి, జలంధరుని దుష్కృత్యముల వచించి రక్షింపుమని ప్రార్థించుట. బృంద పతివ్రతాత్వమునకు భంగమొదవించినంగాని జలంధరుడు మడియండని శ్రీహరి చెప్పుట. విష్ణుమూర్తి యా

కార్యభారమునుబూని వెడలుచు, నారదునితో జలంధరుని బరమేశ్వరునిపైకి యుద్ధమునకై వెడలఁ బ్రేరేపింపుమని చెప్పుట.

—:పంచమాంకము:—

రంగము:—(1) నారదుఁడు. జలంధరునితో సంభాషించి పరమేశ్వరునిపై యుద్ధమునకుఁ బురికొల్పుట.

రంగము 2:—విష్ణుమూర్తి జలంధరవేషముతో బృందకడకువచ్చుట. బృంద యాతనిని బతిగాఁ భావించి, పరిచర్యసేయఁ గడఁగుట. యుద్ధమునందు పరమేశ్వరునిచేఁ దెగిపడిన జలంధరుని శిరము బృందముందు వచ్చిపడుట. బృంద యది చూచి, విష్ణుని కపటమును గ్రహించి యాతనిని పాషాణమగుమని శపించుట. లక్ష్మీదేవి బ్రహ్మేంద్రాదులతో వచ్చి తనకుఁ బతిభిక్షఁ బెట్టుమని బృందను బ్రార్థించుట. తానుభర్తతో సహగమనముఁ జేసినచో విష్ణుమూర్తి శాపము వాయునని చెప్పి యాబృంద యగ్నిఁజొచ్చుట. విష్ణుమూర్తి శాపము వాసి బృందంగూర్చి యచ్చటనున్న వారిని సమగ్గా వారు జరిగిన సంగతిఁజెప్పుట. విష్ణుమూర్తి బృందశరీరము విడిచిన స్మశాన భూమికి వెడలుట.

—:షష్ఠాంకము:—

రంగము 1:—ఇంద్రుఁడును బ్రహ్మయు, విష్ణుమూర్తి బృందకై పడు పరితాపమునుగూర్చి విచారింప సతీదేవి కడకరిగి యావృత్తాంతమును జెప్పుట. వారు లక్ష్మీపార్వతీ సరస్వతుల వలన బీజములను గ్రహించి విష్ణుమూర్తి మోహమున చరించుచున్న స్మశానమునందు నాటుట.

రంగము 2:— బృంద తులసియై మొలచుట. తులసిని బృందావనమునకుఁ జేర్చుట. విష్ణుమూర్తి స్వస్థచిత్తుఁడగుట. తులసీ మహాత్మ్యము.




## నాంది

శా॥ బృందం గోరి విచారమందఁ దగునే । విష్ణుండవై యుండి; యీ
చందంబున వినిన న్జనుల్ నగరె చా । ల్చాలింక యంచున్ మహా
నందం బొప్పఁగఁ బల్కఁ గాఁగిట రమా । నారిన్ గృపం జేర్చు, గో
విందుం డేలును గాత సత్కృప మెయిన్ । వీక్షించుచున్ సభ్యులన్.

(నాంద్యంతమున)

సూత్రధారుఁడు—(ప్రవేశించి) పూజ్యులగు నో సభాస్థారులారా!

శా. శ్రీకల్యాణ గుణాకరుండ మరసం । సేవ్యుండు నిత్యుండు, లీ
లాకారుం డఖిలాంతరంగుఁ డమలుం । డాద్యుండనంతుండు, సు
శ్లోకుం డాశ్రిత భక్తరక్షణుఁడు, త్రై । లోక్యప్రభుం డైన, ల
క్ష్మీకాంతుండు నిరంతరంబును శుభ । శ్రీ లిచ్చి మిమ్మోముతన్.

(సభ్యులపైఁ బుష్పములఁజల్లి తనలో) ఆహా! సకలకళావిశారదులగు నీసభ్యులచే నేడొకనూతన నాటకము ప్రదర్శింపఁజేయుటకాజ్ఞాపింపఁబడితిని. ఇయ్యది నాకు సంతోషమేగాని యేనాటక ప్రదర్శనము నీరిచిత్తము రంజిల్లఁజేయుదునా యని సంశయము గలుగుచున్నది. కానిమ్ము. (ప్రక్కం జూచి) మారిషా!

మారిషుఁడు—(ప్రవేశించి) బావా! ఏమి సెలవు?

సూత్ర—ఇంకను నేమి సెలవయని యడుగుచుంటివా? కార్యభారమంతియొ తలపైనుండ నీవిట్లు సోమరివై యుండిన నేనేమందును?

మారి—బావా! నేనుచేయవలసిన కార్యమేమి!

సూత్ర—మారిషా! లతాంతనితాంత సౌరభాక్రాంత దిగంతమును, నిరంతర దక్షిణవాత పూర్ణగోష్ఠాంతమును, కోకిల భృంగశుకారవ చాలితదాంత సంతతిస్వాంతమును నగువసంతము ప్రవేశించినది. చూడుము.

చ. పరుషతమస్సమూహము ప్ర / భాతపువేళకు నెయ్యనర్కజనం
గ రహి సుకేద్ధిశాతటుల / గ్రాలువినోదయకాంతిపంక్తివై
ఖరిఁబరిశీర్ణ జీర్ణదళ / కాండములైన మహీజశాఖికో
త్కరములఁ బల్లవాంకురని / కాయము రంజిలె మంజులాకృతిన్.

మారి—ఈవసంత కాలమెంతయు సౌఖ్యదాయకమైనది కదా!

సూత్ర—ఈవసంతరాత్రమున, నీసభ్యులకు నొక నూతననాటక ప్రదర్శనమున సంతసము గూర్చదలఁచితిని.

మారి—నాటకమేదో నిశ్చయించుకొంటివా?

సూత్ర—అందులకే నిన్నుఁబిలిచితిని.

మారి—బావా! ఇంటబిడ్డ నిడికొని యూరంతయు వెదకినట్లున్నది. నీవు నాందియందు చక్కనికథనే సూచించితివి కదా!

సూత్ర—మారిషా! ఇక్కథను జక్కగ జ్ఞప్తికిఁ దెచ్చితివి. ఆకథ! "సతీ తులసి" యనుపేర నాటకముగ నిటీవలనే యొకకవి రచించినాడు. అయ్యది యింతవఱకెవ్వరును ప్రదర్శించకపోవుటం జేసి, ప్రథమ ప్రదర్శనా గౌరవము మనము దక్కించుకొందము.

మారి—ఆర్యా! గ్రంథకర్త రచనా విశేషమునుబట్టి నాటకప్రదర్శకులకును, ప్రదర్శకుల నైపుణిఁబట్టి గ్రంథకర్తకును బేరువచ్చును. అందుచే నీనాటకము రచించినవారెవరో తెలిసినగాని నేనేమియుఁ జెప్పఁజాలను.

సూత్ర—నీవా విషయమున సందియమందఁబనిలేదు.

ఉ॥ తిరుపతివేంకటేశ్వర ను / ధీశులఁగూర్చి నిరర్గళాద్భుతా
కరరసపుంజ మంజులవి / కస్వరచారు కథాసుధాదురం

ధరబహుళప్రబంధకవి । తారచనాచతురోక్తి సంపదన్
వరలు ప్రసిద్ధుఁడైన కవి । వర్యుఁడొకండు రచించె దీనినిన్.

మారి—పేరు రహస్యమైనదా యేమి?

సూత్ర—అతఁడు మనకుఁ జిరపరిచితుండే

సీ. యోగ్యమైనఁ జూపకే । భూరివెంకటగిరి,
క్ష్మాపాలు సత్కృతిఁ । గాంచినాడు
తిరువూరు నృపతికి । దివ్యకవితఁ జూపి,
బంగారు బిరుదంబు । బడసినాడు
అంకినీడుభూపతి । యాదరింపఁగ నెంత,
యైన విమలయశం । బందినాడు
సత్యవోల్వంశాబ్ధి । , చంద్రులు తగిన స,
త్కవి యంచు మన్నింప । దనరినాడు
తే. గీ. కోటగిరివంశ వారాసి । కువలయాప్తు
చేత బంగారు బిరుదంబు । జెందినాడు
వినగలేదె ద్రోణమరాజ । విమలవంశ
వార్ధి శశిని సీతారామ । వరసుకవిని.

మారి—అవునవును. జ్ఞప్తికి వచ్చినది. అనేక దృశ్యకావ్యముల కితఁడు కర్తయగుట యేగాక, ఇతని విరచితములగు కొన్ని వచన గ్రంథములు పాఠశాలలయం దుంచుటకుగూడ దొరతనమువారిచే నామోదింపఁబడినవి.

సూత్ర—నీకుఁ దెలియని దేమున్నది? (సభికులంజూచి) పూజ్యులగు నో సభాస్తారులారా! గ్రంథకర్త తమకో నిట్లు విన్నవింపుమని నాకాజ్ఞాపించినాడు.

సీ. సాంధ్ర భాషావిశే । షరనాస్య నిక్షేప,
కుక్షిమై యలరెడు । కోమలాంగి
ప్రేక్ష్య జూడఁబడ కొ । ప్పిన యరుంధతిరీతి
వర్తించుచుండిన । వారిజాక్షి

క్షితినాథ చంద్రుల । స్తుతిఁ గాంచి యశముతో
వర్ధిల్లు చుండిన । పద్మగంధి
గర్వ మింతయులేక । కవులకెల్ల విధేయు,
తనుజూపి చాలగేడి । తలిరుబోడి
తే. గీ. మామక కవిత్వ కన్యక । మహిని మీకు
నూతనముగాదు; గావునఁ । భీతివిడిచి
యీ "సతీతులసి"ని మీకు । నిడితి దీని
నాదరింపుడు ప్రీతిమై । నార్యులార.

(ఇంచుక యూరకుండి) నావిన్నపముఁగూడ నొక్కింత వినుఁడు.

సీ. సాధ్వియగా బృందపై । సాహసంబున జలం,
ధరుడు జూపెడి నిరా । దరణవిధము
గర్వించి యాతఁడు పర । కాంతల బల్మిమై,
గూడగా నెంచిన । కొంటెతనము
ఎంతచేసినఁ గాని । యింతివానిని సతి,
శాంతితో గాల్చెడి । సరళతయును
లోకరక్షకుఁడయ్యు । లోలాక్షి బృందను,
విష్ణుండు మోహించి । వెలయుఁ సీతి
తే. గీ. పతి గతియింపఁగా నాబృంద । ప్రాణములను
బాసి, తులసియైన విధంబు । బరగ మీరి
లిందు వీక్షించి యానంద । మందగలరు
ధన్య గుణులార యో సభా । స్తారులార.

(మారిషునిఁజూచి) మారిషా! ఇంక మనమాలస్యము జేయక పాత్రలను సిద్ధముఁ జేయుదము రమ్ము.

(నిష్క్రమింతురు).

ఇది ప్రస్తావన.

---



# సతీతులసి.

## ప్రథమాంకము.

---

రంగము:—(1) [పర్వతగుహాద్వారమున ప్రవేశము:— పరమేశ్వరుఁడు]

పర—(తనలో) మూడుమూర్తులకును మూలకారణమైన యీ యాది శక్తి యెప్పటికి దపము జాలించునో! ఆమె తన తపమున కెవ్వరైన భంగము గలిగించెదరేమోయని నన్నియ్యెడ నతి జాగరూకతతో నుండుమని చెప్పెను. ఇంతవఱకు నామె లేవలేదు. మింటఁ బ్రభాకరుఁడు తన ప్రచండకిరణములతోఁ బ్రకాశించుచున్నాఁడు. అబ్బా! వేఁడి యధికముగనున్నది. (అటునిటు చూచి)

చ॥ మిహిరుని వేఁడికిన్ మిగుల । మింటఁ జరింప నశక్యమై తనూ
రుహములు వీచనోపి కడు । రోజుచు బల్వడనొందుచున్ ముహు
ర్ముహురుదితాస్యతో గగన । మున్ వెస నంటిన వానిఁ బిల్చుచున్
విహగకులంబు లెల్లఁ దరు । వీథుల మాటికిఁ జేరె నొయ్యనన్.

[ఇంద్రుఁడు - ప్రవేశించును].

ఇంద్రు—(తనలో) సృష్టిస్థితిలయంబులకు గారణంబైన యాదిశక్తి నొకసారి దర్శించి కృతార్థుఁడ నగుదుఁగాక- (ఎదుటఁ జూచి) కైలాసపతి యగు పరమేశ్వరుఁడు కూడ నిచ్చటనే యున్నవాఁడు. ఇతని దర్శనముకూడ నాకిచ్చట లభించుట నాభాగ్యవిశేషమే.

(పరమేశ్వరుని సమీపించి)

సీ. పరమపావనియంచు । బిరుదంబు గాంచిన
గంగాఝరము మస్త । కమున నమర

నళికభాగమునందు। నలఘు కుంకుమబొట్టు
గతినున్న మూడవ। కన్ను మెఱయ
వజ్రపంజరనిభ। వక్షస్థలంబున
రమణీయ సర్పహా। రంబు లలర
పగడంపు కాంతికి। వంకఁబెట్టఁగఁజాలు
నరుణజటాసము। త్కరము దనర
తే. గీ. ఫాణిపోషిత హరిణ శా। బకము జెలఁగ
గన్నులకు బండువై యఖిలమం। గళములకును
నాస్పదంబైన నీమూర్తి। నార్తిదీరఁ
గాంచినాడను ధన్యతఁ। గాంచినాడ.

(పరమేశ్వరుని సమీపించి) రజతాద్రి నిలయా! శంకరా! వంద
నములు.

పర—ఓహో! ఇంద్రుఁడా యేమి!

తే. గీ. సుఖమె నీభార్యపౌలోమి। శుభమె మీ జ
యంతపుత్రుండు భద్రమే। యమరతతికి
నీకు చిరతంబు మోదమే। నాకలోక
సార్వభౌమ! వచింపుమా। సంతసింతు.

ఇంద్రు—దేవా! నీకరుణచే మేము సుఖముగనే యుంటిమి.

పర—మహేంద్రా!

తే. గీ. అదె నభోమండలంబున। నయ్యినుండు
చండకిరణుఁడై యుండె, నీ। సమయమందు
నటకుఁబోవుచు నిచ్చోట। కేగుదెంచి
నావు, వినఁదలంతును గార। ణము బలారి.

ఇంద్రు—మహేశ్వరా! నాకితర కార్య మేమియును లేదు. నేనిక్క
డకే యరుదెంచితిని.

పర—కారణము.

ఇంద్రు—ఆదిశక్తిని దర్శించుటకు.

పర—అహ్హాహ్హా (నవ్వుచున్నాఁడు)

ఇంద్రు—శంకరా! అట్లు నవ్వితి వేమి?

పర—మఱేమియును లేదు. ఆజగజ్జనని యోగసమాధియందున్నది.

ఇంద్రు—తపమునుండి లేచిన పిదప నే దర్శించెదఁగాక!

పర—ఆమె తపమునుండి యెప్పటికి లేచునో తెలియదు. అయినను నామె యిప్పుడెవ్వరికిని దర్శనమీయదు. కావున నీవా యాశ యిప్పటికి విడిచి మఱియొక సమయమున రమ్ము.

ఇంద్రు—పరమేశ్వరా! నీవట్లు జెప్పిన నేమందును? దయయుంచి నా రాక నమ్మహాదేవి కెఱింగింపుము.

పర—ఆమె నీవిప్పుడెంత శ్రమపడినను దర్శనమొసంగదు.

ఇంద్రు—ఏమిది! ఆమె నాకు దర్శన మొసంగదా!

చ॥ అమర విభుండనై విబుధు । లందఱు గొల్చుచునుండ నాకలో
కము రహిఁ నేలు నన్నిపుడు । గాంచక యుండున యాదిశక్తి, తా
నమిత కృపారసంబున న । యారె! యిటుల్ వచియింప నిక న్యా
యమె? కృపఁ దాల్చి చెప్పుము మ । దాగమనంబు రు నామె కీశ్వరా.

పర—నీభాగ్యమునుబట్టి యామె నీకు దర్శనమొసంగునని తలంచుచుంటివా యేమి! గర్వాంధకారమున మునిఁగియున్న నిన్ను జూడనేచూడదు.

మ. అలఘు ప్రజ్ఞను యోగమార్గముల న । భ్యర్థించు యోగీశ్వరా
వళికైనన్ నిరతంబదృశ్యయగుచున్ । భాసిల్లు నద్దేవిఁగ
న్నుల వీక్షింపఁగఁజాల వీవిపుడు ని । న్నుం లక్ష్మీగర్వాంకో
పలు గ్రుంగంగ బొనరించి యుంచుటను దే । వాధీశ వేయేటికిన్.

సంపదాంధులను నామె వీక్షించదు.

ఇంద్రు—ఉమాకళత్రా! నీవాక్యములు చిత్రముగనున్నవి. నీవు కేవల మనూయాపరుఁడవై యిట్లు వచించుచుంటివిగాని మాటయొండు కాదు. సమస్త సౌఖ్యములకును మూలము సంపదయేకదా! సంపద లేనివాని బ్రదుకు నిరర్థకము.

పర—ఆసంపదయే మానవుని గ్రుంగఁజేయునది. నీవమరలోక విభుండ వనుమాటయేగాని నీబ్రదుకునకుఁ బ్రతిదినమును గండమే.

తే. గీ. ఎప్పుడే క్రూరదానవుం । డెత్తివచ్చి
రణముఖంబున గెల్చి సా । మ్రాజ్యలక్ష్మి
నపహరించునో యనుచు నీ । వాత్మయందు
జింతతోడను వేఁదవు శ । చీకళత్ర.

నాకట్టిచింత యేమియు లేదుకదా!

ఇంద్రు—నిజమే.

సీ. వసియింప సౌధంబు । వరలకుండుటచేత
వెలయుచుందువు నీవు । వెండికొండ
కడుపు కూటికిలేని । కతమునఁదిందువా
హ్లాదమెసంగ హా । లాహలంబు
ధరియింప హారముల్ । దొరకకుండుటచేత
గళమునఁదాల్తువు । గ్రఘశిపమితి
దారిద్ర్యబాధచే । ధనమున కాసించి
చేరినాడవలకు । బేరుమైత్రి

తే. గీ. యిట్టివాడవు నీవు న । న్నేల పరిహ
సింప? వలదు నీస్థితిన్నాకు । జిత్తమునకు
దుఃఖమైనను లేశ । సంతోషమైన
ధనము లేనట్టి బ్రదుకు వ్య । ర్థంబుగాదె.

సీ. భిక్షపాత్రయు । వెలయకుండుట చేత
బట్టినాడవుచేత । బ్రహ్మశిరము

గప్పకొంటకు శాటి । గానక దాల్చినా
వింపని భావించి । యేన్గుతోలు
విహరింప వని లేక । విహరించు చుందువు
బహుభయంకరమైన । వల్లకాటి
సాహసంబులు లేక । బహుమోదమని యెంచి
యెక్కుచుంటివిగాదె । వృషభమూర్తి
తే. గీ. యిట్టిదేకద నీస్థితి । యెవ్వరెఱుఁగ
రేల నాపైన నసూయవ । హించి పలికె
దిట్లు? పరశక్తి దర్శింప । నెంచునాకు
కొద్ది గొప్పలతో నేమి । కుధరవాస.

పర—ఓహో! మహేంద్రా! నాస్థితిని నీవు వెక్కిరించుచుంటివిగా! నీకెంత భాగ్యమున్నను నాకుఁదుల్యుఁడవుకావు. వెఱ్ఱివాడవై నీవు నన్ను బరిహాసించుచుంటివి నీవాదిశక్తిని దర్శింపవచ్చితివి. ఇది సమయముగాదని చెప్పితిని. దానికీ యనవసర ప్రసంగమేల? తొందరపడినచోఁ గార్యమగునా?

తే. గీ. ఎద్దియెక్కినవాఁడను । నద్దిగావు
డగును నీవెంత చేసిన । నగునె చెపుమ
కొట్టి లేపిన యాశక్తి । కూసినంత
నగ్నిశిఖ్రోగ్ని నమునే । యమరనాథ.

ఇంక శ్రమమొందక యిప్పటికి మరలిపోయి మఱియొక సమయమున రమ్ము.

ఇంద్ర—ఇట్లు చెప్పుటకు నీచిత్తమెట్లు సమ్మతించినది? ఆ పరంజ్యోతి నియట్టి వారిని ద్వారరక్షణోద్యోగమున నియమించుటం జేసి యిట్టిది సంభవించుచున్నది.
తే. గీ. అల్పుడవు నీకు నధికార । మబ్బుకతన
నిట్లు సాహసంబునఁ జేయ । నెంచినావు

పేనునకుఁ బెత్తనంబీయ | వెఱ్ఱియగుచు
శిరమునంతయుఁ గొఱికిన | కరణి నభవ.

పర—మహేంద్రా! మితిమీఱి మదీయ మహిమం బెఱుంగక సంభాషింపకుము. వినాశకాలమునకు విపరీతబుద్ధులు పుట్టునన్నట్లు నీకుఁ జేటుకాల మాసన్నమగుటచే నన్ను దూషించుచుంటివి. బ్రదుకఁ దలంచిన వాడవేని వచ్చిన మార్గమునుబట్టి పొమ్ము. ఆదిశక్తిని దర్శించుటకిది సమయముగాదు.

ఇంద్రు—పోనిమ్ము. భగవతి సందర్శనము జేసికొనఁదలంచిన నాకు నీయాజ్ఞతో నేమి పనియున్నది? నేనే లోనికేగి యద్దేవి తపమునుండి లేచువఱకును వేచియుండెదఁగాక! (లోపలికి పోబోవును.)

పర—(వారించి) ఔరా! ఏమి నీగర్వము!

శా. ఏమేమీ కనుగాన కీకరణి, నీ | వేయాదిశక్తింగనం
గా మోదంబున బోవఁజూచెదవె మ | మ్మున్ జూడ కింత, నా
సామర్థ్యంబు దలంప వేటికి, వినా | శంబుల్ మదిం గోరి యా
భీమోద్యత్ప్రళయాగ్ని మీఁద శలభం | బే దూఁకనుంకించునే

ఇందులకుఁ దగిన ఫలమనుభవించెదవుగాక! ఇదిగో! మదీయ నిర్నిరోధ క్రోధారుణ వీక్షణంబుల నక్షీణ ఘోరాశుశుక్షణి విస్ఫులింగ నికరంబుల గుప్పి నిన్ను దగ్ధము జేసెదఁగాక! (కోపముతోఁ జూచినంతనే యచ్చట యగ్ని జ్వాలలు వెడలును.)

ఇంద్రు—(వడకుచు) హా! పరమేశ్వరా! అపరాధిని రక్షింపుము-రక్షింపుము- (పరమేశ్వరుని పాదములపైఁబడి)

మ. సరసీజాతభవాది లేఖవరు | ల్ప్రాంతంబు సేవింపఁ బె
ల్లిరవై మించు మహానుభావుఁడవు ని | బ్భంగి నాయందు, దు
ర్భరకోపంబును బూని చూచిన నిఁకన్ | ప్రాణంబులున్ నిల్చునే
పరిరక్షింపవె నీకు మ్రొక్కెదను దే | వా! శైలజావల్లభా.

శా. శ్రీవిష్ణుస్తుతపాదపద్ముఁడవు నై । చెల్వొందుచున్ భక్తులన్
గావం గంకణముం ధరించి, సతితోఁ । గైలాసమందుండు, నా
దేవేశున్ నిను నే నెఱుంగియు మదాం । ధీభూత చిత్తుండనై
యేవో మాటల నాడినాడ నిఁక నం । ద్రీ! నన్ను రక్షింపవే.

హర—(చేతులతో నింద్రుని లేవనెత్తుచు) మహేంద్రా! భయమువిడిచి లెమ్ము. నీకభయమిచ్చితిని.

ఇంద్రు—(కరములుమోడ్చి)

మ. అపరాధంబని యైన యెంచక మదీ । యంబైన దుర్బుద్ధిచే
విపరీతంబుగ నిన్నుఁబల్కితి భవ । ద్విఖ్యాత కారుణ్యాదు
ష్టిపథంబందున నన్ను నిల్పుచును ర । క్షింపందగున్ వేగ, నే
నపవిత్రుండఁ బవిత్రుఁ జేయుము మహా । త్మా! భక్తరక్షామణీ.

దేవా! భవదీయ దివ్యమహిమ నెఱిఁగియుండియు, మూఢుండనై యజ్ఞానంబునఁబడి నీయెడల నపరాధంబు గావించితిని. భవదీయ వీక్షణంబులనుండి వెలువడిన యగ్నిజ్వాల లింకను బ్రజ్వరిల్లుచునే యున్నవి. నాభయముబాపి రక్షింపుము,

హర— తే. గీ. చింతపడబోకు దీనికి । స్వాంతమందు
జ్ఞానులకె యుట్టిదోకప్పు । సంభవించు
నీవు ధన్యుండవైతివి । నేడు నాదు
కరుణఁగాంచి నాడవు గాన । సురకులేంద్ర.

(అగ్నిజ్వాలలవైపు చూచి) నా నేత్రమునుండి వెలువడిన యీ యగ్నిజ్వాలలు నిరర్థకమై పోవరాదు. కావున నేను వీనిని సముద్రమునఁ బడునట్లు చేసెదను. ఈ జ్వాల యొకని జన్మమునకుఁ గారణమగుఁ గాక.

(అగ్నిజ్వాలలను జేతితోఁబట్టి విసరివేసి)

మహేంద్రా! ఇంక నీవరుగుము.

నేమి యొనర్పఁగావలెను । నయ్యది కార్యము యానతిచ్చినన్
మూమదికిన్ ముదంబుగను । మేలు ఘటింతును భక్తిమీఱఁగన్.

బ్రహ్మ—(తనలో) మహేశ్వరుని కోపానలజ్వాలయే శిశువై యొప్పెనని యీసాగరునకుఁ దెలియదు. (ప్రకాశముగా) రత్నాకరుండవగు నీకు మాయందంత ప్రేమయుండ, మాకేమి కొఱత ? (బాలునిఁ జూచుచు) సాగరా ? తన యపూర్వ తేజంబుచే దిశలను వెలిగించుచున్న యీ బాలుఁ డెవ్వరో యెఱుంగ వచ్చునా?

సాగ—దేవా! నాకును దెలియదు. ఇట్టి సుందర రూపుని నేను మున్నెప్పుడును జూచి యుండలేదు. ఇంతకు మున్నే నే నీతనిం గాంచి మదీయపూర్వ పుణ్యమున నీసూనుడు లభించెఁగదా యని పరమామోదము నందుచుంటిని.

విష్ణు—శంకరుని కోపానలజ్వాలయే యీ బాలునిగా మారెను. ఆహా! ఏమి! ఈకుమారుని సౌందర్యము నయనపర్వముగ నున్నది. సాగరా! కుమారుని నొకసారి యిటు డెమ్ము. ముద్దాడఁగోర్కె యయ్యె.

సాగ—(విష్ణుమూర్తి చేతికిఁ గుమారునిచ్చుచు)

(విష్ణుమూర్తి కుమారుని నెత్తుకొనినంతనే యాకుమారుఁడు రాక్షసరూపము ధరించి విష్ణుమూర్తిమీద కేగును)

విష్ణు—ఆ! ఏమి! ఈమాయ. నిఖిలదైత్య సంహారుండనగు నాయొద్దనా యీమాయ. ఇదిగో! చక్రముచే నిప్పుడే త్రుంచెదగాక! (చక్రము వదలనెంచును)

బ్రహ్మ—(వారించి) కమలనాభా! నీచిత్తము నాయుద్యమమునుండి మఱల్పుము. ఈతఁడు యథార్థుండుగాఁడు. (రహస్యముగా) రుద్రుని రౌద్రజ్వాలవలన జనించిన యీతని నీవు మడియించితేని యమ్మహాత్ముని మనంబు విన్నఁబోవును. (పరమేశ్వరునిఁ జూచి) పరమేశ్వరా! ఈతఁడు భవత్క్రోధానలజ్వాలవలన ప్రాదుర్భవించి,

జలముచే ధరింపఁబడెనుగాన, జలంధర నామధేయంబున భాసిల్లును. (జలంధరుని జూచి) జలంధరా! సంగ్రామమున నీవెట్టివారినయిన జయింపఁగల శక్తిఁ బ్రసాదించితిని. మా కరుణచే నీ కఖిలభాగ్యంబు లొదవును. విశ్వకర్మ మా యానతిని నీకై యీప్రాంతమున నొక పురము నిర్మించును. నీ వందుండుము.

హర — జలంధరా!

సీ. ధర్మంబె యాతప । త్రముగాఁగ, సకల బు
 ధానురాగంబె సిం । హాసనముగ
మునివరాశీస్సు విం । జామరంబుగ
 న్యాయ వృత్తియె కరమున । గత్తిగాఁగ
సకలదిక్కులఁ బ్రాకు । యశమె చేలముగాఁగ
 ధర్మసంధత జయ । ధ్వజముగాఁగ
రాజరాజుల జోహారు । నీరాజనముగాఁగ
 తేజమే ఘనమైన । దివ్వెగాఁగ
తే. గీ. లక్ష్మి నీయింట నెప్పుడు । లలి వసింప
 నజుఁడు ప్రేమను నీకు బూ । ర్ణాయు వీయ
 శ్రీసతీరమణుండు ర । క్షించి మించ
 ధరణిఁ బాలింపు మాచంద్ర । తారకముగ.

జల — దేవా కృతార్థుఁడనైతిని.

హర — (బ్రహ్మనుజూచి) భారతీరమణా! జలంధరునికై పురము నిర్మించుటకు విశ్వకర్మను త్వరగా నియమింపవలయును. (తక్కినవారిజూచి) మహేంద్రా! శ్రీహరీ! ఇంక మన నెలవులకుఁ బోవుదము. (సాగరుని జూచి) సాగరా! ఇఁక మేము పోయివచ్చెదము.

[అందఱును నిష్క్రమింతురు]

ఇది ప్రథమాంకము.



# సతీతులసి

## ద్వితీయాంకము.

---

రంగము:—(1) [తొందరగా జలంధరుఁడు ముందును- వెనుక నారదుఁడును. ప్రవేశింతురు.]

జలం—

ఉ॥ ఇష్టములేని పెండ్లి యది । యేటికి నాకును, నామె కెంతయో
కష్టము దోచియుండుటను । గాదె తదీయమనంబు నిప్పుడున్
స్పష్టముసేయ నీగతి నె । నర్చెను, దీని కతాన నాకు నే
నష్టముగల్గునో యికను । నా పురికేగెద సత్వరంబుగన్.

ఏమైననేమి? నేనామెను స్వీకరింప నప్పుడే భయమేల? నా దారిని నేనుబోయెద. (తొందరగా నడచుచున్నాఁడు)

నార—ఆ! ఆ! జలంధరా! నిలువుము. నిలువుము. (జలంధరుని సమీపించును)

జలం—మునీంద్రా! నన్నాపవలదు.

నార—సమస్తమును తెలిసిన నీవిట్లు చేసిన నే నేమనఁగలను?

మ॥ గళమందున్ వరపుష్ప దామమిడఁగా । గాంక్షించియున్నంతనే
పడియెన్ గ్రిందికిజారి యంతఁ గలుషభా । వంబందు నిబ్బంగి నీ
పలుకన్ బూని వివాహమొల్లననుచున్ । బల్కంగ భావ్యంబె యా
పలుకుల్ విన్నను నెవ్వరైన నిను నే । బానంచు శ్లాఘింతురే.

ఎట్టివారికైనను నొకసమయమున పొరబాటు గలుగుచుండును. బృంద యుద్దేశపూర్వకముగాఁ బూలహారము నేలఁ బడవైచినదని నీవు తలచుట యెంతయు దోషము. అట్టి యుద్దేశమున్నచో నీకంఠంబునఁ బూలహారముచే నలంకరించుట కామె యేల తలంచును?

జలం—మునీంద్రా! నీవేల యీలీలఁబలికి నాచిత్తమును మఱలింపఁ జూచెదవు?

తే. గీ. శుభసమయ మిది యంచు నా । సుదతి కెఱుక
లేక యున్నదె, యెఱిగియు । లేఖ యిట్లొ
నర్చుటది నాకు నిపు డమం । గళముగాఁగ
దోచకుండునె యిందునా । దోసమేమి.

చేత దాల్చియున్న పూలమాల జాఱి క్రిందఁబడుట కది సూదియా దారమా! అయినను నిప్పుడా తర్జనభర్జన లేల? ఇట్టి యమంగళ కార్యము జరుగుటంజేసి యాబృందను గ్రహించుటకు నాచిత్తము సమ్మతింపదు. ఇంక నాకనుజ్ఞనిమ్ము. నాపురమునకు మరలి పోయెదను.

నార—జలంధరా! ఏపనిఁ జేసినను జగము మెచ్చునట్లుండవలయును.

ఉ. గారము నీపయిఁ గలిపి । కొమ్మతలనాథుల నెల్లరకు దిర
స్కారమొనర్చి నిన్ను విభు । గా వరియింపఁగ గోరినట్టి యా
సారసనేత్రి కీగతి వి । చారము గూర్చుట ధర్మమా నీ
వారయవేల దీనిఁ బరి । యాచకమా యిటు నేయ భూవరా.

ఆ బృందకు నీయందుఁ జిత్తముండుట చేతనే కదా స్వయంవరాగతమై వచ్చిన రాజుల నందఱను నొల్లక, నీకంఠంబుననే పుష్పదామము వేసుకొంచెను! అట్టిచో చేజాఱి యీపూలదండ క్రిందపడి నంతమాత్రమున నీగతిని నాస్వయంవర సభను విడిచివత్తువా? నీయలుక మణికుండలున కెంత విచారమునో కలుగఁజేసెను గదా! బృంద పరితాపము చెప్పఁ దరముగాదు.

మ. జలజాతాక్షిని బద్మగంధి నవలన్ । శాతోదరిన్ సుందరిన్
విలసత్పూర్ణ శశాంక బింబవదనన్ । విద్యుత్ప్రవాళాధరిన్
కలకంఠిన్ భవదీయ దాస్యకలనా । కామున్ జగన్మోహిన్
గలికిన్ బృందను వేగ్రహించి సుయశః । కల్యాణిఁ జేపట్టుమా.

జలం—తాపసోత్తమా! నీవెంత చెప్పినను నాచిత్తమా బృందను గ్రహించుట కావంతయు సమ్మతించుటలేదు. ఇష్టములేని పెండ్లి వలన నెట్టిదోసగు కలుగునో కదా! నాయందుఁ గరుణించి యీవిష యమున నన్ను బలవంత పెట్టవలదు.

నార—ఓయీ! వెఱ్ఱివాడా!

తే. గీ. శకునములు స్వప్నములు గ్రహ । చారములును
వినుము నీవంటివారిని । భీతిఁగొల్పఁ
జాలవు, పిఱికివారల । స్వాంతములన
కలఁచుచుండును నియ్యది । తెలియవొక్కొ.

దీనివలన నీకావంతయు నశుభము గలుగదు. విశేషించి దీని వలన నీకు యశము గలుగుననియే నేను నొక్కి వక్కాణింపఁ గలను.

జలం—తాపసపుంగవా! నాగళంబున నలంకరింపఁబడదగిన పుష్ప హారము బృంద చేతినుండి జాఱుటం జేసి, ముందేదియో కీడు నాకు ఘటిల్లునని చిత్తమున బెంగనాటుకొనినది. అట్టిచో దీని నిక్కువము సరకుసేయ ముందు శుభంబే యొదవునని నీవు చెప్పెడు మాట లకు నాచిత్తమున నెట్లు ధైర్యము నిలుచును? ముందు వచ్చు శుభమేమో తెలియదుగాని, యిప్పుడు జరిగిన కార్యమును బట్టి మాత్రము కీడొదవునని శంకించుచున్నది. ఇటువినుము.

తే. గీ. కానరానట్టి శుభమెందుఁ । గలుగవచ్చు
కనులకును దోచు కీడదు । కానఁగలండె

తాళిగట్టిన మేల్బావి । తప్పదనుచు
నువ్వుఁనీరును ద్రాగెడి । మొప్పెగలఁడె.

నార — జలంధరా! ఇవి యన్నియు ననవసరమైన యుత్తరప్రత్యుత్తరములు. బ్రహ్మమానసపుత్రుఁడనైన నావచనంబుల విశ్వసింపుము. అనుమానము నిన్ను బాధించుచున్నదిగాని మఱియొకటికాదు. నీవిప్పుడిట్టి యకార్య మొనరించితివేని లోకమునందు దలయెత్తి మెలంగఁ జాలవు. ఇదియునుగాక విరించి కరుణా సమాసాదిత మహా పరాక్రమవంతుండవైన నీకేమిభయము! ఇంక బ్రతివచనము జెప్పక వచ్చి బృందాగొనుము (ఎదుటఁజూచి) అదిగో! చూడుము.

సీ॥ వలఘుతపరివార । జలదాంతరంబున
దీపించు క్రొమ్మించు । దీవయనఁగ
నబ్ధిమథన సమ । యంబునఁ బ్రావిర్భ
వంబునందిన రమా । బ్జాస్యయనఁగ
నఖిల భూవరహృద్బ్వ । దార్ఢ్యంబు విధిసృజి,
యించి పంపించు మో । హినియనంగ
నిజనాథు డాయ హృ । న్నీరజంబున నుంచి
కుతుకంబుతో వచ్చు । రతియనంగ
తే. గీ. సలస్వయుఁ వరాంగంబు । నందు విరుల
దండలోసిల్చి యున్నది । తన్వి బృంద
కాన నామె నుదికి హర్షి । మలరునట్లు
సంకి విదనాక్షి నమ్మింక । యుష్మతేంద్ర.
మ. శరదాఖ్యాబ్జ దళాక్షి భూరివిమల । చ్ఛాయాకలాపంబుచే
నుపవాటి నలంకరించు గతిఁద్రా । నాత్మీయహస్తాగ్రభా
స్వ ఫుల్లాబ్జలతాంత దామకముచే । గైసేసి యా బృంద సు
స్థిరభక్తిన్ నినుఁ బూజసేయఁగను వే । చెన్ రమ్ము భూపాలకా.

ఇంక మనంబున మఱియొక విధమైనశంకఁ బెట్టుకొనక రమ్ము.
(చేయిబట్టుకొని తీసికొనిపోవును.)

రంగము:—2.[మందిరమున—మణికుండలుఁడు—బృంద—జలంధరుఁడు]

మణి—(జలంధరునిఁ జూచి) జలంధరా! స్వయంవరమందిరమున నా తనూజవలన జరిగిన యపరాధమును మఱచిపొమ్ము. (ఇంచుక యూరకుండి)

ఉ. మామక భాగధేయగరి । మంబున నీచెలిజన్మమందె, నీ
తామరసాయతేక్షణ క । తంబున దావక బాంధవానుబం
ధామితవైభవంబు వెన । నబ్బెఁగృతార్థుఁడనైతినింక నీ,
శ్యామను గూర్మినేలు కొను । మయ్య జలంధర భూమినాయకా!

(బృందను జూచి) అమ్మా! బృందా! భవదీయపూర్వపుణ్య విశేషమున నీజలంధరుఁడు నీకుఁ బ్రాణేశ్వరుండైనాడు. సకలమెఱింగిన నీకు నేనేమియుఁ జెప్పనక్కఱలేదు. అయినను వాత్సల్యమునఁ జేసి చెప్పుచుంటిని.

సీ. భయభక్తులను బూని । పరమానురాగవై
చెలువుని కన్నుస । న్నలమెలంగి
చిత్తమం దేవేళ । బత్తిపెంపొందఁగా
వృద్ధులకును సేవ । వెలయఁజేసి
యాప్తబంధు జనాళి । నాదరంబునఁ గాంచి,
మృదుభాషణముల స । మ్మోద మొసగి
గర్వమింతయు లేక । కరుణతో నతిథుల,
నిష్టమృష్టాన్నసం । తృప్తిఁదేల్చి
తే. గీ. కరుణపీడక సత్యంబు । మరువకుండ
పట్టి సాధ్వీలోకంబున । నెందు లేద
టంచుఁ బ్రజలెల్ల వినుతించు । కట్టిభంగి
నుభయకుల పవిత్రవగుచు । నొప్పుమమ్మ.

మ॥ అనిశంబున్ రమణప్రియాచరణ కా । ర్యాయత్త చిత్తాబ్జవై
యనువర్తించి జగంబులందున మహా । ఖ్యాతిన్ బ్రవర్తించి రా

యనఘస్వాంతలు భూరిశాంత లనసూ । యారుంధతీ కాంతలం
గన! నీవట్లు సుకీర్తిఁ జేకొనఁ దగుం । గా భర్తృసేవారతిన్.

మ. ఆర్యులటన్న మేల్ వ్రతము । లన్నను దేవతలన్న శాశ్వతై
శ్వర్యములన్న నిర్మలయ । శంబులటన్నను బంధులన్న, స
త్కార్యములన్న భాగ్య సుకృ । తంబులటన్నఁ గుమారి నీకు, ని
య్యార్యసుతుండె సర్వమని । యాత్మ దలంచి చరింపుమమ్మరో.

చ॥ సతివయి జన్మగోత్రము । యశంబలరింపుము మావధూటినై
స్థితి నిజవల్లభాలయము । చెన్నువహింప నొనర్పు మక్కలా
పతివయిప్రాణ నాథువర । భావ కుతూహల మాచరింపు మీ
గతి విలసిల్లినన్ వినుము । ఖ్యాతివహింతువు లోకమందునన్.

బృంద — తండ్రీ! నీయుపదేశ వాక్యములు నాహృదయ ఫలకమున లిఖించుకొని యుందును.

మణి — (జలంధరునిఁ జూచి)

సీ. జననముందిన దాది । జననిని నెన్నఁడు,
విడనాడి యెఱుఁగని । ప్రిదుమోక్షి
పురమును నేఁబాసి । యరిగినప్పుడు నాదు,
రాకకై వేచెను । రాజవదన
యొండకన్నవ నేము । యెన్నఁడెఱుఁగక,
సౌఖ్యంబు లందెడి । జలజనయన
కోకంబు నొక్కంటి । చూపినఁ గన్నుల,
నశ్రువుల్ నించెడి । యతివమిన్న

తే. గీ. మామకతనూజ యీసతి । మాన్యచరిత
భార్య యయ్యెను నీకు నే । భంగిదీని
సరసి రక్షింతు వోకృపా । కరుఁడవగుచు
భారమంతయు నీయదే । పార్థివేంద్ర.

ఉ. ఆకలి గొన్నఁ దానడుగ । దన్నము కుత్తుకయొండి యుండినన్
గైకొన జోదు దాహమును । గిన్నెని పెద్దలె యివ్వగావలెన్
మాకును జెప్పదేమియును । మాన్య చరిత్ర! సుశీల నీమెని
వేకరణిన్ కృపారసము । నింపుచు నింపుగ నేలెదో కదా.

జలం—(తనలో) నాకీతని పలుకులే వినఁబడు చుండుటలేదు. పుష్ప
హార మీమె శిరమునుండి పడినంతనే నాకీయుపిద యుండున్న
మోహమే పోయినది. ఆనారదుని వాక్యము నతిక్రమింప జాలక
యీమెనుగ్రహించితిని. (ప్రకాశముగా) కృపాలా! ఇఁక మేము పోయి
వచ్చెదము.

బృంద—తండ్రీ! నాథుని సాటనరిగెదను. (విచారించును).

మణి—కుమారీ! చింతింపకుము. లోకైక వీరుండగు జలంధరుఁడు
నీకు భర్తయయ్యె. నీభాగ్యము వర్ణింప దరముకాదు. అప్పుడప్పుడు
నీకుశలవార్తల దెప్పించుకొను చుందుము. మేమును వచ్చిచూచు
చుందుము. నీకిచ్చటనుండి కావలసిన యమూల్య వస్తుచయముల
బంపుచుందుము. నీపతియనుజ్ఞ వడసి తీసుకొని వచ్చుచుందుము.

జలం—రాజేంద్రా! ఇఁక మే మరిగదము.

మణి—శుభమగుఁగాక. పోయిరండు.

[అందఱును నిష్క్రమింతురు].

రంగము :— 3. [ వనము — ప్రవేశము — బృంద ]

బృంద—(తనలో) ఎంత భాగ్యము గాంచిన నేమి? ఎట్టి సౌఖ్యములు గలుగు
చుండిన నేమి? అగ్నిహోత్రుని సాక్షిగఁ గొన్న పతి పతిచే
నిరాకరింపఁ బడినప్పు డివియన్నియు నిరర్థకములు గదా! అకటా!
నాభర్త కృత్యముల నే నేమని చింతింతును? బ్రహ్మ వరప్రసా
దిత మహారాజ్య బలసంపన్నుఁడనియు, సుగుణమూర్తియనియు

దలంచి, మరసార వివాహమాడితినిగాని యిట్లగునని కలనైనఁ దలంపనైతినిగదా!

తే॥ గీ॥ ఎట్టి సౌందర్యముండిన । నేమి? యెట్టి భోగ
భాగ్యములు గల్గిననేమి । భర్తచేత
జూడఁగాఁ బడనట్టి యా । సుదతి బ్రతుకు
కానఁ గాచిన వెన్నెల । కరణిగాదె.

నాథునకు నాయందనురాగము లేకపోయినఁ బోవుగాక! పరసతుల భంగము సేయు తలంపు మానుమని యెంత చెప్పినను వినడయ్యె. మునియాశ్రమంబులఁ బ్రవేశించి వారాశ్రమమున లేనితరిని దత్పత్నుల బలిమిం బట్టదలంచుచుండును. పరనారి కంటఁబడుట భయముగానున్నది. ఈ దురుద్యోగమునుండి యాతని చిత్తము ద్రిప్పుట కెంత ప్రయత్నించినను నాప్రయత్నము కొనసాగకయున్నది.

సీ॥ తనుఁజేరి నామీద । నెనరుంచుమని వేడ
వినఁడాయె, దాయఁగాఁ । గనుచు నన్ను
పరకాంత గవయుట । పాపమంచును నోచ
డాయెగాఁ నేనెంతొ । డాసి పలుక
మానుల నేచుట । మానుమంచును గోర
మానఁడాయె మదంబు । బూనుగాని
పరిధర్మ కథమందు । వత్తిగపుమని పల్క
గొనఁడాయె నాపల్కుఁ । గోపమూని
తే॥ గీ॥ ఎంత చేసినఁగాని నా । సంతమైన
మనసు కరుగదు నామీఁద । మన్మనోవి
భునకు ; నేమిసేయుదునింకఁ । బ్రోవ వేడు
దానఁ బ్రాణేశ్వరుని మంచి । దారిఁ బెట్ట.

ఇట్టియంతయు నేను తొలిజన్మమునఁ జేసిన పాపమీవిధముగఁ బరిణమించినది. ఇంతకును భగవదాజ్ఞకు నన్యథా జరుగనేరదుకదా! శక్తివంచన లేకుండ నాజీవితేశ్వరుని సన్మార్గమునఁ బెట్టఁజూచెదను.

(తెరలో)

దేవీ! బృందా! బృందా!

బృంద—(ఎదుటఁజూచి) అదిగో! నన్నరయుచు నవమాలిక వచ్చుచున్నది.

నవమాలిక—(ప్రవేశించి) దేవీ! బృందా! నీవాజలజాకర తీరంబున నుంటివేమోయని తలంచితిని.

బృంద—లేదు. ఇక్కడనే యుంటిని.

నవ—దేవీ! మన మొక్కింత కాల మీవనంబునఁ జరింతమా! అటు జూడుము. ఉల్లంబులు రంజిల నెల్లెడఁ గొల్లగఁ బూసియున్న మల్లెలును, మిగుల సువాసనచే నెగడుచుఁ జెట్లక్రిందఁ బడియున్న పొగడలును, మదనుని కరంబున నుండు బాకులోయనంబడు కేతకీపుష్పములును, మొదలగు సమస్త విరులును సంపూర్ణముగ పూచియున్నవి.

బృంద—(తనలో) నాచిత్తము వనవిహారమునకు సమ్మతించునా? నిరంతరమును మనోహరునిఁ గూర్చిన చింతయేగాని మఱియొక విధమగు చింతయే లేదు. అయినను నాపరితాపమీ నవమాలిక యెఱుఁగనేల? ఇట్టిది యొకరు వినవలసినది కాదు. (ప్రకాశముగా) నవమాలికా! ఆ పుష్పసంతతుల కేమిగాని యిటు జూడుము. చిలుక ముక్కులచే నొక్కబడి, కెంపురుచు లీనుచున్న దాడిమ ఫలంబు లెట్లున్నవో ఆహా! వనరామణీయకము కన్నులకు బంధుమైయున్నది.

మ. స్వనితాంతాహతి కోర్వలేకను తరు । చ్ఛాయాప్రదేశంబుచే
త నరణ్యాంబున డాగియుండు బహుళ । ధ్వాంతంబులన్ రూపుమా
ప ననేకాకృతుల్ ధరించి యినుఁడే । వన్యన్ బ్రవేశించెనో
యన శోణద్యుతితో ఫలావళులు నిం । డారెన్ మహీజంబులన్.

ఇదిగో! ఈప్రక్కకువచ్చి, సకలసురమునిరాజ పూజానిదానములును, మిళిందవ్రజనిధానములును, స్వదర్శన ప్రభేదిత విరహిలోక ప్రతానమానములును నగు సూనంబు లెట్లు మహిత రుచుల నొప్పుచున్నవో చూడుము.

నవ—వానికేమిగాని యిటు చూడుము.

మ. చపలాక్షీ! ఘన సాధ్వివైన నినునో । జన్ జూచి యుక్తాళ్యనీ
కపుగీతంబుల నియ్యశోకలతికా । వారంబు నీమన్ బ్రహా
శపు మాణిక్యమయంపు బాత్రికలఁగాం । తుల్ దీర సూనప్రదీ
పపుబిండూనుచు మంగళారతులిడెన్ । భక్తిప్రపత్తిక్రియన్.

బృంద—సఖీ! ఆ కాసారతీరమున నా బకవ్రజ మెట్లుండెనో చూడుము.

నవ—దేవీ! పరాంగనల గవయఁదలంచి చడియుఁజప్పుడు గాకుండ, నటునటు తారులాడు విటకాండ్ర చందమున, మీనంబులఁ బట్టుటకై యాబకములు దొంగతపము సేయుచున్నవి.

[విష్ణుమూర్తి ప్రవేశించును.]

విష్ణు—[తనలో] ఈమె చెలికత్తె నన్నుఁదిలకించెనా యేమి? (పరికించి) లేదు. లేదు. (ఇంచుక యూరకుండి) జగద్రక్షణకార్యదీక్షా ధురంధరుఁడనైన నాకీబృందపై మోహము జనించుటకుఁ గారణము నేనే యూహింపఁజాలక యున్నాను.

తే. గీ. సకల భువనముల శాసింప । జాలునాకు
బృందపై మోహమీరీతి । వెలయు టేడ ?
జగము దీనిస విన్నచో । నగదె? హరియె
య్యట్టి దుష్కార్య మొనరించె । నే యటంచు.

చిత్తమును నీ యుద్యమమునుండి మఱలించుటకెంత ప్రయత్నించినను మఱలకున్నది. (ఇంచుక యూరకుండి) బృందమహాసాధ్వి.

నిరంతర పతిసేవాపరాయణ. జలంధరుఁడు విరించి వరసంజనితబల గర్వోద్రేకుఁడై చరించు చున్నను, నామెయాతనిని దైవమువలెఁ బూజించుచున్నది. జలంధరుఁడెట్టి దుష్కృత్యముల సేయుచున్నను నాబృంద మంగళ సూత్ర మహిమమున నాతఁ డేవిధమగు హానియు జెందకయున్నాఁడు. నేనీబృందకు నాయభీష్టము దెలిపెదఁగాక! ఆమె యందులకు సమ్మతించెనేని నామోహాగ్ని చల్లారుటయేగాక దుర్నీతిపరుఁడైయున్న జలంధరుఁడు మడియును. దీనం జేసి దేవతలకు హితము జేసిన వాఁడనగుదును. అట్లుగాదేని బృందపాతివ్రత్యశిరోమణియను విజయధ్వజముం జగంబున నిలిపిన వాఁడనగుదును. ఏమైనను బృంద సౌందర్యము నాచిత్తమును సంపూర్తిగ నాకర్షించినది.

తే. గీ. కొమ్మఁగన్నఁ బమ్మరునైన । రిమ్మతెగులు
గలుగుననుమాట నాయందె । నిలచెనిపుడు
గాక యుండిన నేనేడ । కలికి కొఱకు
హృదయమున మోహమూని, చ । రించుటేడ.

ఆహా! వైకుంఠ పురంబెక్కడ! ఈ జలంధరుని పురంబెక్కడ! బృందపైనున్న మోహము నన్నింత దూరముగొని వచ్చినది!

బృంద—(చెలికత్తెనుఁజూచి) సఖీ! నవమాలికా! వనవిహారమిఁక జాలించి గృహమునకుఁ బోవుదమా?

విష్ణు—(తనలో) ఈమె గృహంబున కరుగునాయేమి? ఈమె వెంట జెలికత్తెయుండఁగా నేనెట్లు సంభాషించుటకు సాహసింతును?

నవ—బృందా! గృహమున కరుగుటకుఁ దొందరపడనేల? ఆ జాజి పూవులం గోసికొనివత్తము. రమ్ము. (బృంద[illegible]ష్క్రమించును).

విష్ణు—(ఏకటఁజూచి) ఆహా! ఏమి! ఈమె సౌందర్యము జగన్మోహనమైయున్నది.

మ॥ త్రిజగన్మోహన కాంతిఁ గొల్పి, తనువున్ । దీపింప బ్రాభాత నీ
రజ బంధు ప్రభఁ గూర్చి; నెమ్మొగము నా । రాకానిశానాథు, న
క్కజమ్మై నవ్వగ జేసి; బృంద నిటులో । కంబాదు సృష్టించె, నా
యజనిర్మాణపుఁ బ్రౌఢి మెచ్చువగు వ । హ్వా మానసంబాదుసన్.

నిజముగా సృష్టికర్త తన నేర్పంతయు నీమె నిర్మాణమునందుఁ జూపినాడు. అందుచేతనే చతుర్దశభువనంబులయందుగల సతులకు సౌందర్యమున దలకట్టై యున్నది.

ఉ. ఈరుచిరాంగి విశ్వధర । ణీంద్ర పురంధ్రులగూడ మించి, వి
స్తారము నందముండునని । ధాత వధూటి లలాటవాటి సిం
పారఁగ వ్రాయనోపు నటు । లౌటనె యీజలజాక్షి కిట్టి యా
కారము గల్గెఁ; గానియెడ । గల్గెనె వేరొక కాంత కెందునన్.

(కరిగించి)కాంతామణి సౌందర్యమెంత చూచినను దనివితీరకున్నది.

సీ. పద్మాస్యవేణితో । బ్రతిగాక కాబోలు,
వల్మీకములఁ జేరె । ఫణులకుంత్రి
తరళాక్షి మోముతో । సరిరాక కాబోలు,
బహుళార్తి గ్రుక్కెను । పద్మవైరి
యింతి చందోయితో । నెనగాక కాబోలు,
గతులు వాసె నల వ । ర్వతపున్నమితి
కలికి నెన్నడుముతో । దులగాక కాబోలు,
చేరె గుహాలయందు । సింహతతులు
తే. గీ. పొలతి కుఱువులగోడి కా । బోలనంట్లు
తలలు వంచుకొని నిలిచె । దరుణి పాద
ములకు సదృశంబుగాక కా । బోలు కమల
గణము పంకోదయావాప్తి । గాంచియుండె.

ఈ యాకృతిం గాంచి యెట్టివారైనను మోహసాగరంబుఁ బడుట నిశ్చయము.

తే॥ గీ॥ కామ రహితుఁడగు మహాత్ము । కామినైన
నిర్మలాత్ముండె మైనను । నిపుణుఁడైన
నమిత వేదాంత విదుఁడైన । నసఘుఁడైన
నువిదఁ గాంచిన మోహంబు । నొందకున్నె.

(పరికించి) అదిగో! బృంద చెలికత్తె పూవులంగోసికొని యామెతో నేమియో చెప్పుచున్నది. ఇఁక నామె గృహంబునకేగునాయేమి! (మరలఁజూచి) చెలికత్తెతో మరల నేమియో పలుకుచున్నది.

( తెరలో )

నవమాలికా! నీవీపూవులంగొని గృహంబునకరుగుము. నేను భగవంతుండగు శ్రీమన్నారాయణుని పూజార్థమై ప్రత్యేకముగఁగొన్ని పుష్పములు సంగ్రహించుకొని వచ్చెదను.

విష్ణు—(తనలో) అదిగో! ఈమె చెలికత్తెను గృహమునకుఁ బంపివేసి, మదీయ పూజార్థమై విరులం గోయ సీప్రక్కకు వచ్చుచున్నది. ఈమెం జేరి భాషించుట కిది యెంతయు మంచి సమయము.

( బృంద — ప్రవేశించును. )

బృంద—(తనలో) నవమాలికను గృహంబునకుఁ బంపితిని. విష్ణునకుఁ బ్రీతియగు నాపుష్పములను గోసికొని నేనుగూడ సత్వరంబుగ నరిగెదఁగాక!

( పూవులు గోయుచుండును )

విష్ణు—(తనలో)

మ॥ అకలంకోజ్వల గాత్రియై తనరు నీ । యంభోజపత్రాక్షి వా
మక సమ్మోహ కళావిశేషమును జెం । పంగాసిటం జేరఁగ, నే
నిఁక సందేహము నంతయుఁ విడిచి యా । హేమాంగినిం జేరి; మా
మక మోహం బెఱిఁగించి సమ్ముదమునం । భాసిల్లగాఁ జూచెదన్.

నేనీమె కంటఁబడెదఁ గాక. (బృందయెదుటకు బోవును)

బృంద—(విష్ణుమూర్తిని జూచి తనలో) ఎవ్వరీ పురుషుడు? శుద్ధాంత కాంతనగు నేను విహరించు నీవనంబునఁ బ్రవేశించెను. చెలికత్తెను గూడ గృహంబునకుఁ బంపితిని. (ఇంచుక యానలకుఁ బోయి) ఆహా! ఈ మహాత్ముని తేజము వనంబంతయుఁ బ్రకాశింపఁ జేయుచున్నది. ఈదివ్యపురుషుం డెవ్వడోకదా! ఆలోచించిచూడ నీమహానుభావుఁడు త్రిమూర్తులలో నొక్కఁడై యుండును. మదీయ పురాకృత సుకృతంబునం జేసి శ్రీహరియె యిట్లు సాక్షాత్కరించి యుండెనని తలంతు. (ఇంచుక యూరకుండి) నాహృదయమున నదియొకవిధమగు భయముగూడ జనించుచున్నది. ఏమైనను బరపురుషుఁడగు నీతనితో నెట్లు భాషింతును? నేనిఁక సత్వరముగ గృహమునకరుగుటయే మంచిది. (పోవును)

విష్ణు—(ఎదురై) బృందా! నిలువుము. నిలువుము.

బృంద—(ఇంచుక భయము నటించి) ఈ మహానుభావుఁ డెవ్వరో నన్ను నిలువరించినాడు. ఇప్పుడు నేనేమి సేయుదును? (ఆలోచించి) ఈపుణ్యమూర్తి యెవ్వరో యరసెదఁగాక! ఇంతమాత్రమున నాశీలమునకేమి భంగ మొదవును? (ప్రకాశముగా)

మ. కమలాకాంతుఁడవో! ప్రభాకరుఁడవో । కామారివో భారతీ
రమణీనాథుఁడవో శచీపతివొ తా । రాభర్తవో, నీదు తే
జము నిండెన్ దిశలెల్ల, యెవ్వడవు, యీ । చందంబునన్ వచ్చినా
వు? మహాత్మా! కరుణన్ వచింపుము నినున్ । బొల్పారఁ బ్రార్థించెదన్.

విష్ణు—తరుణీమణీ! ఇప్పుడు నీవు చెప్పినవారిలో నొక్కఁడను.

తే. గీ. భక్తమానస పీఠి ని । వాసభూమి
భక్తరక్షణ కార్యంబు । పరమ హితము
సకల దేవతాతతి నాకు । నాప్తసఖులు
గాగ వెలుగు చుండుదు నేను । కంబుకంఠి.

చ. మనమున సంతతంబును స । ముంచిత భక్తిని బూనుచున్ దురం
తనిరతి నన్ భజించెడి బు । ధప్రకరంబున కిష్టవైభవం
బును ఘటియించుచుండుఁ బరి । పూర్ణకృపారస ధారఁజిల్కుచున్
వనరుహపత్రనేత్రి నను । భావమునందు గ్రహింప కుంటివే?

బృంద—(తనలో) ఈతని పలుకులు మాన్యగర్భితములుగనున్నవి. ఈతని జగదానందకరంబగు రూపముఁజూడగా శ్రీమన్నారాయణుఁడని తలంచెదను. మదీయ సుకృతంబునఁజేసి, యీపుణ్యమూర్తినన్ను గృతార్థురాలుగఁ జేయ నిచ్చోటకు విచ్చేసియుండును. (ఆలోచించుచుండును)

విష్ణు—ఓకుటిలకుంతలా! ఆలోచించుచుంటివేమి? ఎవని పూజార్థమై యిప్పుడీ పుష్పములను నీవు గ్రహించుచుంటివో, యతనిగ నన్ను భావింపుము.

బృంద—(సంతోషముతో తనలో) నేఁడు నాపుణ్యము పండినది. ఇమ్మహాత్ముఁడు సాక్షాదిందిరానాథుఁడు. (తనలో)

సీ. ఫాలార్ధచంద్రుపైఁ । బ్రాపించు నీలాభ్ర,
కోటినాఁ దగడు ముం । గురులవాని
రమణీయలావణ్య । రసనరసి జనించు,
తొగలు నా దనరు కం । దోయివాని
కరితుండముల నేలి । పరమభక్తులకు సం,
తత మభయ మిడు హ । స్తములవాని
వజ్రపంజరసిభం । బై సంతతంబును,
సిరికాటపట్టైన । యురమువాని

తే. గీ. అఖిలలోకములకు మూల । మైనవాని
కలితభక్తరక్షణ దీక్ష । గలుగువాని
నిఖిలమునిజన సన్నుతి । నెగడువాని
నాదినారాయణుని గంటి । నార్తిదీర.

(ప్రకాశముగాఁ గరములుమోడ్చి)

సీ. కలశవారాశి యే । లలిత చేతునకుఁ,
బావనంబైన ని । వాసభూమి
వేయు జిహ్వలుగల్గి । వెలయు శేషాహియే,
క్షీరగుణుండు ని । ద్రించుపాన్పు
విడనాడ కెవ్వడు । వెంటనేయుండెడి,
పక్షీంద్రుఁ డెవ్వాని । వాహనంబు
సకలజనతతి కై । శ్వర్యమ్ము నొసగెడి,
యిందిరా జలజాక్షి । యెవనిదేవి

తే. గీ. వర సురలుమును లెవ్వాని । వందిజనులు
భక్తరక్షణ మెవ్వాని । పరమహితము
నట్టి, లోకైకనాథుని । నమలచరితుఁ
గాంచఁగంటిని కన్నుల । కఱవుదీర.

దేవా! శ్రీమన్నారాయణా! పరమనిష్ఠాగరిష్ఠులై ఘోరతపం బొనర్చు మునీంద్రుల కయినను లభింపని నీదివ్యమంగళ విగ్రహ సందర్శనము నేడు నాకు లభించినది. జగద్రక్షకుండవగు నిన్నుఁ బూజించు క్రమముగూడ దెలియని యజ్ఞానురాలను. నన్నెట్లురక్షించెదవో!

విష్ణు—సతీమణీ! బృందా! నేను భక్త సులభుఁడను. నీపైన నాకున్న యనురాగమే యిట్లు సాక్షాత్కరింపఁ జేసినది.

బృంద—దేవా! లక్ష్మీకళత్రా!

మ. సరసీజాత భవాది శంకరులు, స । శ్రాంతంబు సేవింపఁబె
న్థిరవై మీఱుచు మహాను భావుఁడవు నీ । విట్టింగి నన్నుం గనన్
వరకారుణ్యము బూని నీకు నిర్జరా । ప స్ఫూర్తితో వచ్చుట
స్థిర భాగీరథి చాటినేల పయిన । స్థిన్ బాఱినట్లే కదా.

విష్ణు—చకితాక్షీ! ఇందు నీవు నన్ను వినుతింపవలసిన పనియేమియును లేదు. నిరంతరము నీచిత్తము నాపైన నిలిపియున్న దానవగుటంజేసి, భక్తిభావంబున నీకు నేను గట్టుబడితిని. భక్తులెవ్వరును నన్నింత సులభముగా వశముఁజేసికొని యుండలేదు.

బృంద—మహాత్మా! నాపై నీకు నిట్టికరుణ జనించినదిగాని, నిరాహారులై వాయుభక్షణ సేయుచు మహారణ్యములందు బరగు నిన్ను బూని ఘోరతపము జేసిన తాపసోత్తములకంటె నేనెక్కువ దాననా?

విష్ణు—(తనలో) నెమ్మదిగా నాహృదయ మీమెకుఁ దెలియఁజేసెదఁగాక! (ప్రకాశముగా) బృందా! నన్నుఁగట్టి వేసినది నీభక్తిపాశ మొక్కటియే కాదు.

బృంద—కేవల మూఢమతిననై నేనెట్లు భక్తురాలనని చెప్పుదును? ఆర్తరక్షణా! ఇందు నీకరుణా విశేషముదప్ప మఱియొకటి లేదు.

విష్ణు—అదియును గాదు.

బృంద—దేవా! ఇఁక నేనేమని చెప్పగలను?

చ॥ వనజదళేక్షణా! విమల । భక్తజనావన! నీదుదివ్య ద
ర్శనమున మత్కఠోర కలు । ష ప్రకరంబు దొలంగె జన్మపా
వనత లభించె నిప్పుడు, న । వార్య కృతార్థతగంటి మత్ప్రగా
తనకృత పుణ్యమెట్టిదో క । దా! నిను జూడగఁగంటి మాధవా.

విష్ణు—శశివదనా! నన్ను వీక్షించుటంజేసి నీవు కృతార్థురాల వయితివి. నిన్ను వీక్షించుటచేత నేను కృతార్థుఁడ నగుదును.

బృంద—(తనలో) ఈ దేవాదిదేవుఁడిట్లు వదించుచుండెనేమి? (ప్రకాశముగా) జగత్కల్యాణమూర్తివగు నీవు నన్నిట్లు బలుకనగునే?

విష్ణు—
మ॥ అతివా! సందియ మింతలేదు విను స । త్యంబిద్ది లక్ష్మీసతీ
పతినై యుండి సమస్తలోకములు బెం । పఁజాలి బృందారకుల్
కుతుకంబూనుచు భక్తిమై గొలువ వై । కుంఠంబునం దుండు, నే
నతి మోదంబున వచ్చినాడ నిటు నీ । కై యొక్క కార్యార్థమై.

బృంద—మహాత్మా! నీవాక్యము నాకెంతయు వింతఁగొలుపుచున్నది. దేవాదిదేవుండ వగు నీవు నాకడకుఁ గార్యార్థివై వచ్చితినని పలికిన నేమనఁగలను?

విష్ణు—నారీమణీ! ఇది నిశ్చయమే! నేను నిన్ను యాచించుటకే వచ్చితిని.

బృంద—సమస్తయాచక జనచకోరచంద్రుఁడవగు నీ వొరులను యాచించువాడవా! ఇట్టి వింతగలదా!
సీ॥ రత్నాకరము నీకు । రమణీయ వాసంబు
జీవనం బెంతయో । చెలగుచుండె
ఇందిరాదేవి నీ । హృదయ మందుననిల్చె
ధనమునకేమియు । దఱుగు లేదు
భూదేవి రెండవ । పూబోఁడి యగునీకు
కోరిన పంటల । గురియుచుండు
నిఖిల బృందారకుల్ । నీయాజ్ఞ నుందురు
వలసిన దంతయు । భక్తినిచ్చి
తే॥ గీ॥ అట్టి నీవేడ! యొరులను । యాచనంబు
నేయుటేడ! నీవాక్యముల్ । చిత్రమయ్యె
నెందుకీరీతి బల్కితో । యింతయైన
కారణ మెఱుంగ కుంటిని । కమలనాథ.

విష్ణు—సుందరవదనా! నేను చెప్పినమాటయం దసత్య మావంతయును లేదు. నా మనంబున నొకవిషయమైన కోరిక యొదవుటం జేసియే నీ కడ కరుదెంచితిని. అక్కార్యము నీవలనఁ జక్కబడవలయును.

బృంద—(తనలో) భగవంతుండగు నీ శ్రీమన్నారాయణుని వాక్యముల యందర్థము నాకుఁ దెలియుట లేదు. ఒకవేళ నన్నుఁ బరీక్షింపఁ దలంచి యేదియేని నెరవేర్పుట కశక్యమైన కోరికఁ గోరదుగదా! (ప్రకాశముగా) దేవా! జగత్కర్తవగు నీకోరిక దీర్చుటకుఁ దగినంత శక్తురాలనా? నాయందు కరుణ యుండుటం జేసి యిట్లు పలించెదవుగాని, కాకున్న నేనెంతదానను. అయినను కృపాంతరంగుండవై భవదభీష్టమెట్టిదో యానతిచ్చితివేని, నీకరుణకుఁ బాత్రనై యశమందు భాగ్యము నాకుండునేని, చేయఁ జూచెదను.

విష్ణు—బృందా! నా యభీష్టము నీవు దీర్పఁదలంచినచో దీర్పఁగలవు; కాని చెప్పుటకు నాచిత్తమే యొక్కింత వెనుదీయుచున్నది.

బృంద—మహాత్మా! భక్తులయందట్టి సాదియము నీకుండఁగూడదుకదా!

విష్ణు—[తనలో] ఇంకఁ గాఁపాడరణం బోనిరికక నాయభిప్రాయమెఱిఁగించెదగాక! యోషామణీ! నన్నియ్యెడకు నాకర్షించి గొని తెచ్చినది నీసౌందర్యమే కారణము

తే. గీ. జగములందున నున్నట్టి । సతులలోన
నందమున మేటి వగుచును । నలరునట్లు
గలిగి నిన్ను సృష్టించె నా । కమలభవుఁడు
భవ్యభవదీయ భాగ్యంబు । బహుకవశమె.

బృంద—(తనలో) ఈజగత్కర్త నాసౌందర్యమును గూర్చి పలుకుచుండెనేమి? (ఆలోచించుచున్నది)

విష్ణు—

మ. అనుమానింపక తెల్పుచుంటి వినుము । ద్యద్రాజబింబాస్య; నీ
ఘనసౌందర్యమె తెచ్చె నియ్యెడకు; ఓ! కర్కంగట్టి నన్నిప్డు, నీ
వనుమానింపక యందమందు మదభీ । ష్టావాప్తిఁ జేకూర్చెదో
విని దోషంబిది యంచు లోఁదలఁతువో । ప్రబోష్ఠి యేమందువో.

తే. గీ. సకల జగములు రక్షింపఁ । జాలినట్టి
స్వామి నీదు రూపముగాంచి । నెలఁత! మోహ
మంది, భవదీయ రక్షణం । బందవచ్చి
నాఁడ, నెట్లాదరింతువొ । హరి మిన్న.

బృంద—(తనలో) అక్కటా! సర్వజగన్నియామకుండయిన యీ భగవంతుఁడు నన్ను మోహించెనుగదా! ఇట్టి వింత యీతని విషయమున మున్నెన్నఁడైన వినియుంటినా? శ్రీమన్నారాయణుం డగు నితఁడెక్కడ? సామాన్య యువిదనగు నేనెక్కడ? నన్ను గామించుటేమి? (ఇంచుకయూరకుండి) భగవంతుఁడగు నీతఁడు మదీయ పాతివ్రత్యము పరీక్ష సేయఁదలంచి యిట్లు గోరియుండునని తలంచెదను. నేనీ మహానుభావునకు నేమని ప్రత్యుత్తర మిత్తును? (ఆలోచించి) కానిమ్ము. నాభక్తిఁజూపుచు నెమ్మదిగా నిట్లుబలికెద గాక! (ప్రకాశముగా)

సీ. శ్రీమద్వైకుంఠపు । రీ నిలయుండవైయుండి,
ధర్మపద్ధతివీడి । తనరుటేమి
అక్షీణ లక్ష్మీక । ళాకటాక్షుడవయ్యు
నిట్టికోరిక మది । నెంచుటేమి
పదునాల్గు భువనముల్ । పాలించు మేటివై
యీరీతిఁ బరసతిఁ । గోరుటేమి
సకలభక్తజన ర । క్షకుడవై, నెలతకై
మోహంబు నీభంగిఁ । బొందుటేమి
తే. గీ. చిత్రముగఁదోచె నీదగు । చిత్తవృత్తి
నాగుణము బరీక్షింప, ము । నంబునందు
దలఁచి, యీవిధంబుననుఁ । బల్కియుందు
వంతెగాని నీవేడ యి । ట్లడుగుటేడ.

భువనపాలనుఁడవైన నీవు నాచిత్తము బరీక్షింప నిట్లు గోరితి వని తలంచెదను. కాకున్నచో, నీవేడ? యిట్టిబుద్ధిని బూనుటేడ,

విష్ణు—ఓరమణీ శిరోమణీ! నేనట్టివాఁడనైననేమి ? నీసౌందర్యము నా చిత్తము నాకర్షించినది.

శా. హోహా! దోషమటంచు లోఁ దలఁపకే । యోగీంద్ర మోక్షప్రదున్
భాషేశాది సురస్తవాభరణ వి । భ్రాజిష్ణుఁడన్ నన్ను; సం
తోషంబందఁగ జేయుమీ, యుదియె సం । తోషంబు నీకిచ్చు, నీ
కీషన్మాత్రము నిందరాదవని, లే । నే నేను రక్షింపఁగన్.

బృందా! ఈవిషయమున నీవు సందియ మందవలదు. నీయశమున కావంతయు భంగముగాని మార్గము నే నరసెద.

బృంద—(తనలో) ఆహా! ఏమి యీవింత! ఈతఁడు నిశ్చయముగా నాపై మోహమునందియే యిట్లు వచ్చినాఁడు. భగవంతుఁడగు నీతనికే యిట్టిబుద్ధి పుట్టినచో నెవ్వరు మరల్పఁగలరు? వినయవాక్యములచేత నీతని చిత్తమును ద్రిప్పివేసి యిమ్మహాత్ముని యనుగ్రహమునకు పాత్రురాల నగుటకుఁ బ్రయత్నించెద. (ప్రకాశముగా)

మ. అకటా! యేమని పల్కుదాన నిను దే । వా! నన్ను నింతైన నెం
చక, కామించితివయ్యయో యిది జగ । త్పాలించినన్ సంశయిం
పక నిన్నున్ హరియే పరాంగనకునై । భావంబులో నిట్లు రో
యక మోహంబును జెందెనేయనుచు నిం । దాడం(గ) నూహింపదే.

నీవు మహానుభావుఁడవు. సకల సృష్టిస్థితిలయంబులకును గారణుండవు.

మ. అమలమునీశ నిన్ గొలుచు । నమ్మహితాత్ములు పుత్రమిత్రవ
ర్గముపయి మోహమున్ విడిచి । రాజిలి యోగులు నౌచునుండగా
భ్రమఁగొని నీవె యిట్లు పర । భామరతంబున గాసఁజెందెదే
సుమహిత సద్గుణాభరణ । చోద్యము నీదుచరిత్ర మింతయున్.

ఏమహనీయుని కీర్తనోగ్రకచమున వితతాఘమద్వర్గ లతికావితానము దెగునో, ఏశుభప్రదుని చింతనార్కప్రభలచేత సంసార

తమస్స్రాత మడంగునో, ఏ దేవ దేవుని సేవాదవానలశిఖలు, విపద్ఘాటవిని దహింపఁజేయునో, ఏ మహాపురుషుని భజనాంజనముచే నపవర్గనిధి గానిపించునో, యట్టి యాదినారాయణుండవగు నీవిట్టి కార్యము సేయుట కుద్యోగించిన నేనేమనఁగలదాన? పుండరీకాక్షా! ఒకవేళ నీవు నాచిత్తవృత్తి నరయఁదలంచి యిట్లు బలికితివేమో! నీవావిషయమున సందియమందఁ బనిలేదు. పతిపదాంబుజసేవయు, భగవంతుండవగు త్వత్పదసేవయుఁదప్ప,నన్యసుఖ మేమియు గోరను. కావున నాయందనుగ్రహంబూని, నీచిత్తమును మరల్పుకొని, నీ భక్తురాలిగ నన్ననుగ్రహింపుము.

విష్ణు—

మ॥ అతివా! సందియమంద నేమిటికి ను । ద్యత్ప్రీతి విష్ణుండ యీ
గతి, సామాన్య తలోదరీమణిని నా । కృత్రైన్ మదింగోరి, యం
చితమోదంబున జేరి వేడగను, వా । సింబొందగా నెంచకీ
గతి, వాక్రుచ్చెడి మోహశాంగి కలదే । కల్యాణి యెంతైననున్.

శశాంకవదనా! బృందా! ఇది యధర్మకార్యంబని చిత్తంబునఁ దలంపవలదు. మదీయాభీష్టము దీర్చుటవలన నీకు దుర్యశము గలుగునని తలంచవలదు. నాచేతఁ జేయఁబడిన యెట్టి కార్యమైనను ధర్మముగనే ప్రకాశించును. ఇదియుంగాక నీవు నాకోరిక దీర్చితివేని, నన్నుఁ గూర్చి మహాతపంబాచరించిన మహాత్ములైన నందరాని దివ్యపదంబున నిన్ను నిల్పెదను.

బృంద—

సీ. అఖిలజీవులను నీ । వాడింపుచుందువు.
కీలుబొమ్మలగతిఁ । దోయజాక్ష
కనుకట్టు గట్టెదు । గారడీఁడును బోలె
మిథ్యాప్రపంచము । మేయచరిత
జక్కులవాడవై । జనుల వివేకంబు
బాపుచుండెదవు దైత్య । వత్సలలామ

వేషముల్ వేతువు । బృందారకుల్ వేడ
బహువిధంబుల నీవు । భవ్యతేజ

తే. గీ. మోహమూనెద వ్రేకరిపై । మోహమంద
జేతు విం కొకరిని నిట్లు ? జెలగుచుండు
నీ మహామహిమఁ దెలియ । నీరజాస
నాదులకునైన శక్యమా । హరి ముకుంద.

దేవా! నీయభీష్ట మధర్మమైనదని చెప్ప సాహసించినందులకు నన్ను మన్నింపుము. నేను పరమసాధ్విని. పతిపదాంబుజ సేవయే సతికి భూషణమని యెఱింగినదానను. ఒకరిని సంతోషింపఁజేయుటకుఁగాని లేక స్వార్థము నపేక్షించిగాని నేను సాధ్వినైయుండు దాననుగాను. పతిసేవ కడతికి దైవచింతనకంటె నెక్కుడు మహిమ గలదని నేను గుర్తెఱింగితిని. అట్టిచో నే నధర్మకార్యమాచరించితినేని, నాయాత్మ తిరుగ విముక్తి బొందుట కసాధ్యమగునంతటి ఘోరనరకమునఁబడ గలను. నా సాధ్వీత్వముచే నిదివఱ కార్జించిన యశము మన్ను గలియును. సతికి బతివ్రతాత్వమే సర్వసంపదల నొసంగును. అదియే సర్వాభీష్ట ఫలప్రదము. అదియే సకలాఘ విమోచనము. అదియే సజ్జన స్తవనీయము. అదియే సంతోషకారణము! వేయేల? అదియే మోక్షసామ్రాజ్య సౌధారోహణమునకు సోపానము. కావున నామనం బట్టి యధర్మోద్యోగమునఁ బ్రవేశపెట్టి లోకులు నన్ను నీచముగ జూచునట్లు జేయకుము. భగవంతా! నీ పాదకమలములకు నమస్కరించు చున్నాను. నాయందుఁ గృపాంతరంగుఁడవై నీబుద్ధిని మరల్చుకొని, బృంద మహాసాధ్వియను యశోడిండిమము జగమున మ్రోగఁజేయుము.

విష్ణు—(తనలో) అహా! అమృతోపమానములగు నీమోవాక్యములు నాకెంతయు మోదము గొలుపుచున్నవికదా. సంపూర్తిగ నీమె చిత్తమును శోధించినఁగాని విడువరాదు. (ప్రకాశముగా) బృందా!

నారాయణుండవగు నేను నిన్ను జేరియిట్లు వేడ, వలదని నిరాకరించుట నీకు ధర్మమా?

మ. తరుణీ! యేమి వచింతు నీకిపుడు సం । తాపంబునుంగూర్చి యా
స్మరుఁ డుగ్రుండ యివేడి తూపులడరిం । పందచ్చితాస్త్రాళిఁ జె
చ్చెరబాధింపఁగ నిట్లు వచ్చితిని రా । జీవాక్షి నిస్వేదగాఁ
గరుణం జూడుము నన్ను, నీకును యశః । కల్యాణముల్ జేకురున్.

బృంద—మాధవా! నాహృదయము నీకు విశదపఱచితిని. ఇంకను నీయనవసర ప్రసంగముతో నేమిపని యున్నది? చతుర్దశభువన నాయకుండవగు నీకుం గూడ మదనావస్థయేనా? మదనుండు నీ తనయుఁడే కదా!

విష్ణు—బృందా! మన్మథుండు తనయుండైననేమి? వాడు తన వారిని బెరవారిని నొక్కరీతిగనే చూచును. నీవిషయమున నాతఁడు నన్నుఁ దండ్రి నగుదుననియైన భావింపక బాధించుచున్నాఁడు. ఒక్క మదనుండే కాదు. నాకుటుంబమున నున్న వారందఱును నాకు విచారమును గూర్చువారే!

సీ. నాజ్యేష్ఠ పుత్రుండు । నలు మొగంబుల వే
ల్పశాశ్వత కార్యముల్ । సలుపుచుండు
రెండవ పట్టి మా । రుండు స్త్రీ పురుషుల
మోహ సాగరమున । ముంచుచుండు
నిందిరాదేవి నా । యిల్లాలు నిరతంబు
చంచల వృత్తిఁజ । రించుచుండు
భూమిదేవి ద్వితీయ । పూఁబోడి, మెపపాదు
నిలచినచోటనే । నిలచియుండు
తే. గీ. వసతి రత్నాకరంబు, మేల్ । పాన్పుపాము
వాహనము పన్నగవిరోధి । భళిర నాదు
చిత్రసంసార కష్టంబుఁ । జెప్పవశమె
తెలియకున్నదె నాకథ । కలికిమిన్న.

బృంద—దేవా! ప్రస్తుత విషయమును గూర్చిన సంగతి కాదుగాని, చెప్పుచుంటిని.

సీ॥ అవనిదేవియె నీకు । నఖిల భారకుడన్న
విమలయశంబును । గొలుపంగలిగె
అల రమాదేవి నీ । యాలియై భక్తమం
దారుఁడనెడి బిరు । దంబు గూర్చె
భారతీరమణుండు । పట్టియై గొప్ప సం
సారి యనఁబడఁ । బేరు దెచ్చె
పరమపావని దివ్య । వాహిని పుత్రియై
కలుషనాశనుడన్న । ఘనతఁ గొలిపె

తే॥ గీ॥ నిజము దలపోసి చూడంగ । నీకు నీదు
పరిజనము దెచ్చు ఖ్యాతియే । ధరణినిండె
నీవు దామోదరుండవు । నిశ్చయముగ
తెలియుదా నీదు చరితంబు । జలరుహాక్ష.

పంకజనాభ! మహామహులకైనను దుర్లభంబైన నీ దివ్య మంగళ విగ్రహ సందర్శనము నాపురాకృత భాగ్యంబున లభియించినది. నేను విగతకల్మషనైతిని. నీవు నాచిత్తమారయుటకో, లేక యుద్దేశపూర్వకముగనో, తెలిపిన నీయభీష్టమును మనంబునుండి దొరదోలి, దాసురాల నగు నాగృహంబునకు నేఁడధిష్ఠింపగమ్ము. నాభక్తి కొలఁది బూజించి కృతార్థురాల నగుదాను.

విష్ణు—(తనలో) ఈరమణీమణి యెన్ని వాక్యములయిన బలుకుచున్నది గాని, నాయభీష్టమునకు మాత్రము సమ్మతింపకున్నది. ఈమె హృదయము నిష్కళంకమైనది. ఈమెకు నాయందున్నభక్తి వర్ణనాతీతము. (ప్రకాశముగా) తరుణీ! నేనడిగిన దొకటియు నీవు చెప్పిన దొకటియుగ నున్నది. వాక్కుకు సరియైన ప్రత్యుత్తరమిచ్చెదవు? కాలహరణమునకు నాచిత్తమొంతయుఁ దాళదు.

మ. సరసీజాక్షిరో నాకు నీ విభుని ప్రా ∣ జల్సేతు నన్నందుకే
బరమామోదముగల్గె; గాని వినుమా ∣ భావోద్భవుం డేయు భీ
కర బాణంబులకోర్వలేక నినుఁగాం ∣ తుంజేరి యాచించు శ్రీ
హరినిన్ నన్ను నలంతిగాఁ దలఁచి, యు ∣ ల్లాదంగ నీకర్హమే.

బృందా! నీవు నన్నుఁ గరుణింపవేని విరహాగ్నిం బడి మ్రగ్గుట నిశ్చయము. నేనిట్లు ఖతినేని, సర్వజగచ్ఛోభముగూడ తటస్థించును. ఇందులకుఁ గారణము నీవే యగుదువు. కావున నన్ను గటాక్షించి కృతార్థురాల వగుము. నాకుఁ బ్రీతిసేయుట సర్వజగంబులకును బ్రీతిసేయుట యగు

బృంద—ముకుందా! నీవెంత చెప్పినను నాచిత్తమధర్మోద్యోగమునకుఁ బ్రవేశింపదు. భువనశాసనుఁడ వగు నీవిట్టి దుష్కార్యము సేయఁ దలంచుట యధర్మమగును.

సీ. అఖిల జగంబుల ∣ నజునిచే సృష్టింప,
నొనరించు మహిమ యే ∣ యూను జేరె
భూరి చతుర్దశ ∣ భువన శాసనమహా,
దక్షత యేమూల ∣ దాగియుండె
అశ్రాంత పరమ భ ∣ క్తఘనాగ్రణుల,
బిరుద మేమహాసియు ∣ దరికిఁ జేరె
అమల భక్తమునిగ ∣ ణామర పూజితో,
దార ప్రభావ మె ∣ ద్దడఁగియుండె
తే. గీ. ఆదినారాయణాఖ్య మెం ∣ దలరియుండె
విశ్వసన్నుతి గుణమెట ∣ వెలుగుచుండె
వీనినెల్ల మఱచి యవి ∣ వేకి కరణి
సాధ్వి నగు నన్ను గోరుదే ∣ జలజనాథ.

ముకుందా! మహోన్నతపదవి నధిష్ఠించి యుండినవాఁడ వగుటం జేసి నిన్ను జగములెల్ల భగవంతునిగాఁ గొల్చుచున్నవి. నేనును నీయందు నిర్మలమైన భక్తిఁబూని చరించుచున్నదాననే. ఇట్టి

యీధర్మకార్యమునందు నీవు ప్రవేశించితివేని, నీమహోన్నత పదమునకు భంగము గలుగును. భక్తరక్షణకార్యము మఱిది, యిట్టి యధర్మవర్తనోద్యోగమునఁ బ్రవేశింపఁ దలంచిన నీతో నీ విషయమగు ప్రశంస సేయఁ జాలను గావున నేను గృహంబున కరిగెదను. దేవా! నేనిట్లు బలికితినని యాగ్రహింపకుము. నీదివ్యనామస్మరణ మాత్రము నాచిత్తము నెన్నఁడును విడఁబాయదు. (పోఁబోవును)

విష్ణు—(తనలో) ఆహా! ఈమె నిశ్చల హృదయ మెంతయు నుతికర్హమైయున్నది. (ప్రకాశముగా) బృందా! బృందా! నీవు నన్ను మోహసాగరమునముంచి యరిగెదవా?

చ. అరుగఁగ నెంచెదే జలరు | హాక్షిరో నన్నిటు ఘోరమోహసా
గరమున ముంచివేసి, త్రిజ | గంబుల రాజగు నేను నిన్ను నీ
కరణిని వేడుచుండఁ గనఁ | గా మది నెంచక యింతగా, నిరా
దరణ వహింతువే? భగవ | దార్చన యిట్టిదె? భక్తురాలికిన్

కుందరదనా! నేను నిర్గుణుండనయ్యు, గుణము గలిగిన వాఁడనై ప్రకాశించుచుందును. నిర్మోహమున నుండియును సమస్త జగముల మోహింపఁ జేయుచుందును. రమణీ! నిచే నిరాకరింపఁబడి నే నెట్లు మరలిపోవుదును? శ్రీహరి నగు నేను నీవిషయమున మనోరథసిద్ధి నందకపోయినచో నా ప్రభావమేముండును?

బృంద—ఏమీ మాధవా! భగవంతుండవగు నీవు నీమహిమను పరదారల గూడు నిమిత్తమే వినియోగపఱుపఁ దలంచితివా? అక్కటా! ఎంతసాహసము! నీహృదయము జగ[illegible]లేక పోయెనుగదా!

సీ. తమకంటె నిన్నయు | త్తముఁడని కాదె
సురులు దైవముగ నిల్పఁ | గలిగినారు
సర్వేశుఁడని కాదె | సకల భక్తసమితి
భూరి భక్తిని నిన్ను | బొగడినారు

ఘనమైన పదవిని । గని కాదె తాపస
　　శ్రేష్ఠులు నిన్నఁ బెద్దఁ । జేసినారు
అవ్యయుండని కాదె । యఖిల సవన కార్య
　　ములయందు భోక్తగా । నిలిపినారు
తే॥ గీ॥ వీనిచే గాదె త్రిభువన । విభుఁడవనఁగ
　　దుర్లభపదంబు చేతికి । దొరికె నీకుఁ
　　గాన నిలుపుకొనఁగఁ జూడు । గౌరవంబు
　　నిట్టి దుష్కార్యముల పాత్ర । కేఁగుదేని
　　నిజపదచ్యుతిఁ బొందెదు । నీరజాక్ష.

ఈవిధమున భాషించు నీయెదుట నేనింక నిలువనోప.

(నిష్క్రమించును).

విష్ణు— బృందా! బృందా! అరుగుచుంటివా? భగవంతుఁడనగు నా యెడల నింత నిరాదరణమా! (తనలో) ఈమె సౌశీల్య పాతివ్రత్యములద్వితీయములై యున్నవి. నెమ్మదిగా నీవిషయమై యోచించెదఁగాక. (నిష్క్రమించును.)

ఇది ద్వితీయాంకము.

---




# తృతీయాంకము.

---

రంగము:—[గాలవాశ్రమము ముందు జలంధరుడు—ప్రవేశము.]

జలం—(తనలో) గాలవుని సతియగు చారుమతి సౌందర్యవతులం దెన్నికఁగన్న కాంతయని వినియుంటినేగాని, యెన్నఁడును వీక్షించి యుండలేదు. ఇప్పుడు నే నెట్లయిన యీ ముని యాశ్రమంబును బ్రవేశించి యాకాంత నరయవలయును. నా యుద్యమమున కనుకూలముగ గాలవు డాశ్రమమున లేక యున్నచో, నాభాగ్యము పండినట్లే. (ఎదుటఁజూచి) ఎవ్వరో సుదతీమణి యిట్లువచ్చుచున్నది. ఎవ్వరై యుండును? చారుమతియేమై యుండునా? (పరికించి) నా యనుచరులు చెప్పిన మాటలఁబట్టి జూడఁగా నీమెయే చారుమతి యగునని తోఁచుచున్నది.

(తెరలో)

అమ్మా! చారుమతీ! భగవదారాధనకుఁ బుష్పములఁ దెచ్చుటకు నీవుగూడ వచ్చెదవా? (ఇంచుక యూరకుండి) ఏమనుచున్నావు? నాధుఁడాశ్రమమున లేడు గావున నీవు పోయిరమ్మనియా? సరే! నేను పోయివచ్చెదను.

జలం—(విని తనలో) ఆమెయే చారుమతి. ఆమె వాక్యములఁ బట్టి చూడఁగా గాలవు డాశ్రమమున లేడని తోఁచుచున్నది. నా యుద్యమమున కీ సమయ మెంతయు దగియున్నది. భూపాలుఁడనగు నే నాశ్రమమునఁ బ్రవేశించుట కేవిధమయిన యభ్యంతరమును నుండదు కదా? (పరికించి) ఈమె సౌందర్య మద్వితీయమైయున్నది. మునిపత్నుల కిట్టి సౌందర్య ముండునాయని సంశయించితిని గాని యీమెను జూడఁగానే యా సందేహము వాసినది.

శా. ఔరా కన్నులతీరు; చక్కఁదనమా । హా! మోముచందంబు న
య్యారే! నీలములన్ హసించు కురులా । రారా, మిటారంబు, మ
జ్ఝారే! చన్గవయద్దిరా! తను విలా । సస్ఫూర్తి వహ్వారె; యీ
నారీరత్నముఁబోలు సుందరినిఁ గా । నర్జాల లోకంబులన్.

తే. గీ. కొమ్మ గాదది ముద్దుల । గుమ్మగాని
కలికి గాదది మదనుచే । చిలుకగాని
కాంత గాదది రతనాల । బంతిగాని
భామ గాదది సౌందర్య । సీమగాని.

ఈ తరుణీశిరోమణి వాలుచూపులఁ జూచెనేని, మదనుండే తన విలునమ్ములు నేలఁబడవైచి యీమెకు దాసుఁడు గాక యుండునా? ఈ తలోదరిని వీక్షించినంతనే, యా యనంగుఁడు తన పుష్ప శరంబుల నాపై బఱపసాగినాఁడు. కానిమ్ము. నే నీ యబ్జాక్షిం జేరి మదీయ మనోరథం బెట్టిఁగించి కృతార్థుఁడనై యా కాముని గర్వమడంచెదఁగాక! (ఇంచుక నడచిచూచి) అదిగో! ఆమె బిందె గైకొని జలార్థమై కాబోలు నదికరుగఁ దలంచుచున్నది. భళిరా! ఈమె సౌందర్య మిప్పుడు సంపూర్తిగఁ గానిపించుచున్నది.

ఉ. కన్నుల కబ్బుదీర సిత । కంజదళంబుల మంజువైఖరిన్
గన్నులు; చంద్రసారము ము । ఖంబున, బింబము డాబు వాతెఱన్
బన్నగరీతి కీల్జడను । వల్లులసాటు శరీరశోభలన్
గ్రొన్ననగుత్తుల న్వలకుఁ । గొన్న విలాసముచేత చన్గవన్

దిన్నని దివ్యచంపకము । తీరు కొంచెరగు నాసికంబు నం
దెన్నఁగరాని సొంపుఁగల । కింపుఁబరాంగమునన్ వహించి, రా
జన్నగధాళధళ్యమును । సన్నమొనర్చుచు విప్పుగుచ్చెళుల్
బన్నినపావడఁ జిలుగుఁ । బయ్యెద గుత్త పుఁరైకకవ్వలం
టన్నరయుంచి, శుద్ధ్యనిక । టంబునఁగాంచి ధరించి, సుందిగా
కన్నులఁ విమించి, కర । కంకణముల్ పచరించి, భద్రమున్
నెన్నడఁగింకిణీరవవి । నిర్మల శైలినతిక్రమించి, చం
చన్నితరావలోకన ర । సంభ్రమచే హరిణిన్ హసించి, య
య్యన్నులమిన్న బింబెగొని । యానది కేగెను నీరుదేరఁగన్.

(పరీక్షించి) లేదు. లేదు. మరల నేకారణముచేతనో బిందెక్కడ బెట్టి యామె యుల్లెవచ్చుచున్నది. నేను నెమ్మదిగా నీమె కంటఁ బడకుండఁగాక. (ఇంచుక మాంకునకుఁ బోవును)

[చారుమతి - ప్రవేశించును.]

చారు— (తనలో) పుష్పముల కొఱకేగినమైత్రేయి యింకనురాలే దేమికారణమో!

(జలంధరుఁడు - చారుమతి చూచునట్లు ముందుకువచ్చును)

చారు—(జలంధరునింజూచి కొంచెము వెనుకకేగి తనలో) ఓహో! ఈతఁడు జలంధరుఁడు. ఇప్పు డిసియ్యెడ కరుదెంచుట కేమి కారణమోకదా!

జలం— [చారుమతిని సమీపించఁగా నామె వెనుకకేగుటఁజూచి] తాపసపత్నీ! నన్నుఁజూచి నీవు భయమందెద వేల? నేను పెరవాడను గాను. జలంధరుఁడ. మునీంద్రుఁడాశ్రమమున నున్నవాఁడే?

చారు— (తనలో) మునిపత్నినగు నేనీతనితో మాటలాడినందువలన నేమిదోషము సంభవించును? (ప్రకాశముగా) నృపాలా! వారాశ్ర

మమున లేరు. సమిత్కుశఫలాహరణార్థమై యరిగినారు. ఇప్పుడే యరుదెంచి భూపాలుండవగు నిన్నుం దగిన విధంబున గౌరవింతురు. అంతవఱకును నాశ్రమమున విశ్రమించియుండుము.

జల — (తనలో) ఆహా! ఈ యువతీమణి మృదుమధురభాషణంబులు నాకెంతయు సంతసము గొలుపుచున్నవి. నేను నిమ్మాదిగా నాయభిప్రాయ మెఱుంగించితినేని, యీమె తప్పక సమ్మతించునని యే తోచుచున్నది. (ప్రకాశముగా) యోషామణీ! నీయాదరణంబునకు నేనెంతయు సంతసించితిని. కాని యొకవిషయమున మాత్రము నిన్నుం జూచిన నాకుమిగుల విచారము గలుగుచున్నది.

చాతు — రాజేంద్రా! నీవు నన్నుం జూచి విచారించవలదు. ఒకవేళ మేము తాపసులముగదా నిన్నుం బూజించలేమని నీవనుమాన మొందం బనిలేదు. తపోగరిష్ఠుండగు మన్నాథుం డేతెంచి, భవత్పరివారంబునకును, నీకును గూడ విందు లిడంగలండు.

జల —

ఉ. విందు లొసంగనేల, యరవిందదళేక్షణ నాకు మీర లా
నందము చేరఁ నిశ్చయము నాటిన సాయకమొల్ల వీడినే
నిం దరుదెంచు కారణము నింపుగఁ జెప్పెదనేను, దాని, నీ
వుం డగ నాలకించి కృప బ్రోచెదవో మఱి బ్రోవకుందువో.

మ. సురనారీమణులన్ భుజంగసతులన్ క్షోణీశశుద్ధాంతసుం
దరులన్ గారుడనాథకన్యకల, గంధర్వాంగనాశ్రేష్ఠలన్
జిరమోదంబున గాంచితిం గాని, వినుమీ చూపంగ లేదెందు, నీ
సరిగా కాంతను, నిశ్చయం బిదిసుమా శీతాంశుబింబాననా.

చాతు — (తనలో) ఈతండవసరములేని ప్రసంగములోనికి దిగుచున్నాండు. ఈతని గుణములను గూర్చి మున్నొకసారి నేను వినియున్నాను. అయినను భూపాలుండుగదా! ఆశ్రమమునకు వచ్చినప్పుడు గౌరవించకపోవుట యుక్తముగాదని భావించితిని.

జలం — రమణీశిరోమణీ! త్రిజగంబులను సమ్మోహసాగరంబున ముంచఁజాలిన సౌందర్యము గల నీవొక బడుగు నాగసిని గైకొని కష్టములనుభవించుచుంటివి కదా! నీ సౌందర్యమును గూర్చి నాచారుల వలన నింతకు మున్నె నేకసారులు వినియుండి, యెప్పుడే నిన్నుం గంటఁజూచి సంభాషించు భాగ్యము గలుగ కుండునా యని వేచి యుంటిని. అద్యాది నేఁటికి లభించినది. ఆలస్యము చేసినచో మోసమగును గావున నొక్కమాటలోఁ జెప్పెదను.

మ. వనజాక్షీ నిను జూడఁగోని వినుమా । పంత బుసుకబూని, చం
డనిశాతాస్త్ర కరంపరల్ తనువు నిం । డఁగ జాలగీలించి నె
ట్టన హంసాది ఖగార్భటుల్ జోఁకివే । డ్కన్మన్మథుండుండెఁ; నీ
వనుమానింపక నన్ను నేలుకొని భా । గ్యశ్రీలకోఁ దూఁగుమా.

రమ్ము. నీభర్త రాకమునుపే నాపురంబునకుఁ బోవుదము.

చారు — (తనలో) అక్కటా! ఈనృపాలునకు నన్నుఁ జూడగనే యెట్టి దుర్బుద్ధి పుట్టినది. ఇప్పుడు నేనేమి సేయుదును? మునికన్యకలు గాని, నాధుఁడుగాని యీయాశ్రమమున లేరు. కానిమ్ము - నేనీతనికి సామవాక్యములఁ బలికి హృదయమున నా దురుద్యోగమునుండి మరలించెదఁగాక! ఈలోపుగా తాపసకన్యకలు గాని నాధుఁడుగాని రాక యుందురా? (ప్రకాశముగా) రాజేంద్రా! నీవు నృపాలుండ వనుటచే గౌరవించక పోవుట యుక్తముగాదని తలంచి సంభాషించి నందుకు మాకుఁగలుగు ఫలమిదియా?

ఉ. పాలనశీలమూర్తి విమల । భావము గన్పడ భూతలంబునుం
బాలనసేయు భూపతుల । భంగులెఱింగియు నిట్టిరీతి దు
శ్శీలుఁడవై పరాంగనలఁ । జేరగ నెంతువె, ధర్మమూని, యో
కాళి హసింపనే నిను ధ । రాధిప! బుద్ధి మరల్పుమిప్డె వేగ.

జలం — అమ్మలమిన్నా! ప్రపంచమున నేనొకరిని లక్ష్యపెట్టువాడను గాను. నాచిత్తము నీయందుఁ జిక్కినది. నాయభీష్టము నీకెఱింగిం

చితినేని నీవు తప్పక యంగీకరింతువని తలంచివచ్చితిని. (ఎమటc జూపుచు)

తే॥ గీ॥ అదిగో పరివార మున్నది ( యచట ; రథము
నదిగో యెక్కుమా యిక నంశ ( య్యంబు విడిచి
మత్పురంబును జేర్తు ; నా ( మగువ వగుచు
సౌఖ్యములc బొందెదవుగాక ( జలజనయన.

చారు—(తనలో) ఆశ్రమమున నానాథుcడులేని సంగతి నెఱింగియే యీతcడు నాయెడల ద్రోహబుద్ధినిc బూనివచ్చినాడు. హా! పరమేశ్వరా! నన్నీ దురాత్మునిబారినుండి రక్షింపుము. (ఇంచుక యూరకుండి) దుష్టచిత్తుcడగు నీతcడు నేనేమి చెప్పిననువినcడు. వీనితోc గొంతవఱకుc గాలయాపనము సేయుచునుంటినేని యింతలో నాచెలికత్తెగాని నాథుcడుగాని వచ్చును. (ప్రకాశముగా) జలంధరా! నీ వీశ్వరుని నయనంబుల నుండి వెలువడిన కోపజ్వాల వలన జనించితివి - నీకుc దెలియని పరమధర్మము లెందును లేవు.

మ. చతురంభోధి పరీతభూవలయ రా ( జన్యాన్వయోత్తంస నం
తతి సేవింపcగc జక్రవర్తివయి వ ( న్యగ్రానదీతీర కృశీ
కృతగాత్రిన్ మునిపత్నినీగతి ధృతి ( హ్రీహీన చిత్తుండవై
సతిగాcగమ్మని కోరుచుంటివకటా ( శ్లాఘింతురే నిన్ జనుల్.

మ. క్షితిలో శేర సతీమణుల్ నవవయ ( శ్శ్రీరూపలావణ్యజృం
భిత లోభూవర, నీకుc గోరcగcదలం ( పేయున్న ; నీవట్టిచో
వ్రతనైన నారలు గట్టి తాపసకుటీ ( రక్షోణి యందిట్లు సం
తతమున్ భర్తను గొల్చుచున్ దనరు నన్ ( గామించుటల్ ధర్మమే.

జలం—రమణీ! కాముకులకుయుక్తాయుక్త విచారణముండదు. (ఇంచుక యూరకుండి) ఇంక నేను కాలహరణమునకు దాళcజాలను, (సమీపించుచున్నాcడు)

చారు—(తనలో) ఈతఁడంతకంతకు మీఁదకు వచ్చుచున్నాఁడు. ఇచ్చట వీనిదుష్కృత్యమును వారించు వారెవ్వరును లేరు. (ప్రకాశముగా) భూపాలా! ఇదినీకు ధర్మముగాదు. నేను తాపసపత్నిని. సాధ్విని. పరాంగనారతము పాపమని యెఱింగియు నిట్టి దురుద్యోగమునఁ బ్రవేశించుట నీకీర్తికినిఁ బ్రాణములకుఁగూడ హానిసంభవించును. నామాటవిని నన్ను నీసోదరిగ భావించి వచ్చిన దారినిఁ బొమ్ము. ఇట్టి దుర్వృత్తిఁ బ్రవేశించి, సాధ్వీమణుల నోటినుండి వెలువడు శాపాతురమహాగ్ని జ్వాలల కాహుతుఁడవు గాకుము.

జలం—తరుణీ! నన్నీరీతి భయపెట్టఁ జూడకుము. కామించి వచ్చిన నన్ను నీయంతట నీవాదరింతువేమోయని యింతవఱకును గాలహరణమున కోర్చితిని. ఇంక నేనోర్వజాలను. నేనేనిన్ను బలవంతముగ రథముపైఁ బెట్టుకొని కొనిపోయెద. (పట్టుకొనఁ బోవును)

చారు—(కోపముతో) ఔరా! ఏమి! నీసాహసము. తాపసపత్నినగు నన్ను బలవంతమునఁ గొనిపోయెదవుగా! నీకు వినాశకాలము సమీపించినది. (నాథుని నుద్దేశించి) హా! నాథా! దుశ్శీలుఁడగు జలంధరుఁడు బలవంతమున నన్నుఁగొనిపోవ దలంచుచున్నాఁడు. సత్వరముగ వచ్చి నన్ను రక్షింపుము. హా! మైత్రేయీ! ఈసమయమున నీవైననున్నచో నీదురాత్ముఁడీచ్చటకు రాకయుండునుగదా!

[ తెరలో ]

ఎవ్వఁడా దురాత్ముఁడు! ఇదిగో వచ్చుచున్నాను.

జలం—(ఎదుటఁజూచి) అక్కటా! కార్యమునకు భంగమైనది. అదిగో! గాలవుఁడే వచ్చుచున్నాఁడు. ఇంక నేనిచ్చట నిలచియుండరాదు. మఱియొక సమయమున నీమెనెట్లయినఁ గొనిపోయెదగాక.

(తొందరగాఁ బోవును)

చారు—(తనలో) అబ్బా! గండము గడచినది. ఈ నీచాత్ముఁడు నాథుఁడు వచ్చుచుండుటఁజూచి యీప్రదేశము విడిచినాఁడు. లేనిచో నాకెట్టిహాని సంభవించి యుండునోకదా!

గాలవుఁడు—(ప్రవేశించి) ఎవ్వఁడా దురాత్ముఁడు!

చారు—నాథా! వచ్చితివా! ఈసమయమున నీవు రానియెడల నేనట్టి యాపదను బొందియుందునో కదా!

గాల—అది యేమి?

చారు—జలంధరుఁడు...

గాల—ఆదురాత్ముఁడు నేడు మన యాశ్రమమునకు వచ్చెనా యేమి? పరనారీ హరణమానసుండగు నాతఁడు నీకెట్టి హానియుఁ జేసియుండ లేదుకదా!

చారు—నీరాక యీ హానిని దప్పించినది. ఆతఁడాశ్రమమునకువచ్చి యనినమాట లన్నియు సావకాశముగఁ జెప్పెదను.

గాల—వానికి వినాశకాలము సమీపించినది. రమ్ము.

(నిష్క్రమింతురు)

రంగము:—(2):-[జలంధరుని మందిరము:-ప్రవేశము జలంధరుఁడు]

జలం—(తనలో)

మ. అకటా! యేమియొనర్తువాఁడ నిపుడ / య్యబ్జాతపత్రాక్షి చే
తికిఁ జేకూడియుఁ దప్పిపోవుటను రా / జీవాక్షి పుత్రుండు, మా
మకధైర్యం బెడలింపసాగెను నికం / బద్మాక్షి నెట్లింగఁ జే
తికి లభ్యంబగు నట్లుజేసి మదనో / ద్రేకంబు వారించెదన్?

ఆనాఁడు గాలవుఁ డాసమయమునకు రాకయున్నచోఁ జారుమతిని నా గృహమునకుఁ జేర్చియే యుందును. (ఇంచుక యూరకుండి) మించిన దాని కిప్పుడు యోచించినందువలనఁ బ్రయోజన మేమియున్నది? ఎట్లయినను సఖుయము వేచియుండి, చారుమతిని బంధించుకొని రమ్మని భటుల కాజ్ఞాపించితినిగదా!

[బృంద - ప్రవేశించును].

బృంద—(జలంధరుని సమీపించి) ప్రాణేశ్వరా! నేడింత దీర్ఘాలోచన తత్పరుఁడవై యుంటివేమి? కారణ మెఱుంగ దగుదునా?

జలం—ప్రతివిషయమునందును జోక్యము గలిగించుకొన వలదని యెన్ని సారులు చెప్పినను నీవేలవినవు?

బృంద—నాథా! ఆగ్రహింపవలదు. రాజకార్య వ్యవహారమైనచో నే నా తెరువునకు రాను-కాని, నీచిత్త మితరాలోచనయందు మగ్నమై యున్నదని తెలియుచున్నది.

జలం—మనస్సులోపల యూహాగూడఁ గనిపెట్టఁ దగినంత సమర్థురాలవు.

బృంద—నీచింత పరనారీహరణంబును గూర్చి కాకున్నచో నాకు బెంగయుండదు.

జలం—అదియైన మాత్రము నీకేల బెంగ?

బృంద—పరనారీహరణము పాపమునకు మూలమని.

జలం—నీకు దెలిసిన మాత్రము ధర్మములు నాకుఁ దెలియవా?

బృంద—అగ్యపుత్రా! నేనట్లుఁ జెప్పుటకు సాహసింపఁగలనా? సర్వ మెఱింగియూడియు నేకారణముచేతనో నాకుఁ జింతఁ గూర్చుచుంటివి.

జలం—నేనేమి నీకుఁ జింతఁ గూర్చితిని?

బృంద—

సీ. మనసార నీపాద । ఘనసేవఁ గొమ్మంచు,
నన్నుఁ డైనను నాకుఁ । నిచ్చినావె
ముకమూర నవ్వుడైన । మృదుమధురవచో
సరణి నాకును జూపఁ । జాలినావె

నీవె దైవంబుగా | నెంచియుండిన నాకుఁ
ప్రేమ యొక్కింత, చూ | పించినావె
యగ్నిసాక్షిగఁగొన్న | యతివ యంచును నన్ను
గాసంత కరుణతోఁ | గాంచినావె
తే. గీ. యకట! నీకు నర్ధాంగినై | యలరునాకు
తాపమునుగూర్ప నీకును | ధర్మమగునె
నీకుఁదెలియని ధర్మంబు | లోకమందు
గలదె నీకు నే వచియింపఁ | గలనె నాథ.

జలం—ఇష్టములేని వివాహము సౌఖ్యమున కాకరముగాదని నేను తొలుతనే తలంచితిని.

తే. గీ. అల స్వయంవర సమయంబు | నందు నతివ
నాగళంబున హారమ్ము | నైవఁబోయి
క్రిందఁ బడవేసినప్పుడే | కుందరదన
భూరివైరాగ్య మొందితిఁ | బూర్ణముగను.

బృంద—నావలన గలిగిన యానేరమునకా మీరిట్లు నన్ను నిరాదరించుట !

జలం—రమణీ! అప్పుడు నేను వివాహ మక్కఱలేదనియే పలికితిని కాని, యానారదుఁడు నన్ను బలవంత పఱచుటచేత నిన్ను మెడకుఁ గట్టుకొంటిని.

తే. గీ. గంగిరెద్దుకు మెడలోన | గంటయట్లు
గట్టుకొంటిని నినునేను | కాంతమిన్న
యిప్పుడేమి చింతించిన | నేమి ఫలము
ననుభవింపంగ వలయును | నేజన్నివ్రాలు.

బృంద—ప్రాణేశ్వరా ! నామూలమున నీకు గలిగిన విచారమేమి యున్నది? పరదారాగమనంబు వలదనియు, తాపసుల బాధించుట తగదనియు, చెప్పుటయేకదా. నావలనదోషము ! నీశ్రేయమును నేను గాక మఱెవ్వరు గోరుదురు?

సీ. పరసతీ మణులపై । భ్రాంతిని వీడుమా,
యంచు వచించ నా, । లించినావె
మునిపుంగవుల నేచఁ । బోవలదంచును,
జెప్పుమాటను జెవిఁ । జేర్చినావె
అసుర సంతతిఁ గాంచి । హసియింప దగదంచు,
నెంత చెప్పిన గుర్తు । నెఱిఁగినావె
"ధర్మమే జయి"మను । తాత్పర్యమును బూను,
మని చెప్పు నానుడి । నరసినావె

తే. గీ. యిట్టివన్నియు వీడియుంచి । యెపఁగుకతన
నీకునాపై నసూయ జ । నించెఁగాదె
గాకయుండిన నాయెడను । గలిగినట్టి
దోషమేమి నీకును దోచ । దో! నిజేశ.

మనోహరా! ఎంత భాగ్యముండిన నేమి! ఎట్టి భోగములుండిన నేమి? ఘోర విపదాంబుధిఁ దరించుటకు నావయు, సంతాపదావాగ్నికి ఘనవృష్టియు, బాధారణ్యమునకు నాలవిత్రంబును, మోక్ష సంధానకర్తయునగు పతిసేవకు దూరమైన సతి బ్రదుకేల?

[తెరలో]

ఈదురాత్ముల బారినుండి నన్ను రక్షించు పుణ్యాత్ములు లేరా!

బృంద—(ఆలించి) స్త్రీయార్తరవము వలెనున్నదే!

చారు—(జలంధరుని నుద్దేశించి) హా! నరపాలా! ఎంతదుష్కార్యము చేయించితివి? ఇట్టిదుష్కార్యమునందు వర్తించుచున్న నిన్నుఁగాలుడింకను గొనిపోవక యుండెనేమి? పతివ్రతా శిరోమణుల నీవిధంబున చేయుటకేనా నీవుజన్మించినది?

బృంద—[తనలో] పాపము ఈమెయెవరో సాధ్వి. నాథుని దురంత కృత్యములకు మేరలేకుండెనుగదా! (ప్రకాశముగా) ప్రాణేశ్వరా ఈమెయెవరు?

జలం—ఎవరా! అన్ని విషయములు నీకే కావలయును. గాలవుని భార్య.

బృంద—అక్కటా! ఎంతఘోరము ఎంతఘోరము! తాపసి పత్ని యగునీమె యెడల నిట్టి కృత్యము సేయ సాహసించుట ధర్మమా?

చారు—(బృందనుజూచి) అమ్మా! బృందా! నీవును నాడదానవుగదా నీభర్త మొన్న మాయాశ్రమమునకువచ్చి నన్నెన్నో మాటలాడి తుదకీరోజున నిట్లుజేయించినాడు. ఈతఁడెప్పుడో సాధ్వీమణుల శాపముచేతనే యంతమందును.

బృంద—(జలంధరునిఁజూచి)

చ. పరసతులెల్ల దల్లులని । భావములోఁ దలపోతమాని, యా
పరమ పతివ్రతామణి, న । పారగుణాకర నిట్టి భంగినిన్
బరిభవమున్ బొనర్చుటది । భావ్యమె, శ్రేయమె, చాలునింక, నీ
తరుణిని దల్లిగాఁగనుచుఁ । దాపసి సన్నిధిఁజేర్చఁగాదగున్.

ఇట్టి కార్యములే, గౌరవనాశనమునకును, ప్రాణహానికిని గారణములగును.

చారు—(బృందనుజూచి) తల్లీ! అట్లుజెప్పి నన్నురక్షింపుము.

జలం—(బృందనుజూచి)

మ॥ అలినీలాలక యిట్టి కార్యముల చా । యన్ జేరి యిబ్భంగినిన్
బలుకం జెల్లునె నీకు, నిర్భయత; నీ । పద్మాక్షిపై నాకు ను
జ్జ్వలమోహాం బొదవంగ దెచ్చితిని, నె । వ్వాడైన వారింపఁగా
దలఁపుం బూని చరించునే, మదిని వం । తంగుందనీ కేటికిన్.

బృంద—నాథా! ఆగ్రహింపకుము. సాధ్వీమణుల నీవిధంబు సేయుట తగదని చెప్పుటకు సాహసించుచుంటిని. నాకు, నీపదాంబుజ సేవ యొనఁగ లేదని నైనను చింతింపనుగాని, యిట్టియ కార్యము నాయెదుటజరుగుచుండ నేను సహింపఁగలనా? తుదకీకార్యములు బలవంతముగ నాప్రాణముదీయును. ప్రాణేశ్వరా! ఏమో కలికితి నని తలంపక, యీమెను విడిచిపుచ్చుఁడు. (చారుమతిని సమీపించి)

తల్లీ! నీవు చింతింపకుము. నానాథుఁడొనర్చిన యపరాధమును సైపుము. నిన్ను మీయాశ్రమమునకు సుఖముగాఁ జేర్పించెదను. రమ్ము. (చారుమతిని దీసికొని లోనికిఁబోవును)

జలం—(తనలో) గాలవుఁడు వచ్చుటచేత నీచారుమతి యిప్పుడు దప్పించుకొనినది. ఇప్పుడు బృందయడ్డపడినది. ఈభటులీమెను బృందయొ ఉంగు నట్లు దెచ్చుటచే నిట్లయినది.

సేవ—(ప్రవేశించి) మహారాజా! నారదమునీంద్రుఁడువచ్చి యున్నాఁడు.

జలం—(తనలో) ఈసమయంబున నితఁడేల యరుదెంచెనో గదా! (ప్రకాశముగా) మునీంద్రున కభ్యంతరమేమున్నది? శీఘ్రముగా లోనికిఁ బ్రవేశపెట్టుము.

సేవ—చిత్తము. (నిష్క్రమించి వెంటనే నారదునితోఁ బ్రవేశించును).

నార—(తనలో) ఈ జలంధరుని దుష్కృత్యము లంతకంతకు హెచ్చుచున్నవి. తక్కిన విషయము లెట్లున్నను, బరదారాగమనము, అందులో మునిపత్నులను భంగమొనరింపఁ దలంచుట యెంతయు ఘోరముగ నున్నది. కానిమ్ము. ఈతని దుష్కృత్యములకు నేను దోడై శంకరునితోఁ గయ్యము సంభవించునట్లుఁ జేసెదను. దానం జేసి కలహాభోక్తనగు నాకు సంతోష మొదవుటయేగాక, త్వరలోన సర్వాగ్గ్ర శమనుగంటుటకూడ సంభవించును.

జలం—(ఆసనమునుండి లేచి) మునీంద్రా! వందనములు. ఈపీఠ మలంకరింపుము.

నార—(ఆసీనుఁడై) జలంధరా! నీకుఁ గుశలమే కదా?

జలం—మునీంద్రా! నీ కటాక్షమునఁ గుశలముగనే యుంటిని. (ఇంచుక యూరకుండి) మహాత్మా! నీరాకచే నేను ధన్యుఁడనైతిని. ఇప్పుడు నీవెచ్చటికిఁ బోవుచు నిచ్చటి కరుదెంచితివో యానతిచ్చెదవా?

నార—నేనిప్పుడు కైలాసమునుండి వచ్చితిని.

జలం—కైలాసమున విశేషము లేమి?

నార—నే నక్కడ కరిగిన సమయమునఁ బరమేశ్వరుఁడు లేఁడు. గంగా పార్వతులు లేకారణముననో కలహించుచుండిరి.

జలం—పరమేశ్వరుని జీవితకాలమంతయు నా సతుల కయ్యము వారించుటకే సరిపోవుచున్నది. ఇంతకును కలహకారణ మేమో నీకుఁ దెలిసెనా?

నార—కలహకారణమేమో నాకును దెలియలేదు గాని పర్యవసానము మాత్రము తెలిసినది. గంగ పార్వతికి నీవొకనిచేఁ బట్టుబడుదువుగాక యని శపించినది.

జలం—మునీంద్రా! తాను మహాసాధ్వినని యాపార్వతికి మిగుల గర్వమున్నది.

నార—ఈసంగతి నీవుగూడ గ్రహించితివికదా! ఆమె కొకసారి గర్వభంగము కావలెను. (ఇంచుక యాలోచించి) జలంధరా!

సీ॥ అరయఁ జిచ్చుకైపైన బ్రహ్మాస్త్రమున్న
పగిది, మానుల భార్యలఁ బట్టఁబట్ట
దలఁచుచుండెద' విదియేటి దర్పగుణము
బలముగల్గిన నా"నాతి"నిఁ బట్టుమయ్య.

ఇట్టి కార్యము నీవు చేయఁజాలితివేని నీయశము చతుర్దశభువనంబుల యందును నిండును.

జలం—తాపసోత్తమా! ఈసంగతి మంచిసమయముననే చెప్పితివి. నేనిప్పుడు పార్వతినిఁ బట్టితినేని యామెకు గర్వభంగమగుటయేగాక, గంగ యిచ్చినశాపము కూడ నిజమగును.

నార—జలంధరా! మాటలవలన ప్రయోజనము లేదు.

జలం—నారదా! నేను మాటలఁ జెప్పువాఁడనుగాను.

జలం—తరుణీ! నీవు నా కెట్టిభయమును గొలుపవలదు. నేను తలంచిన కార్యము నెరవేరువఱకును నిం(ద్రించువాఁడనుగాను. నీ వీ విషయమున మారు బలుకకయుండుము.

బృంద—హా! నాథా! ఇదియేమి సాహసము!

సీ. పరదేవతాకృపా । ప్రాప్త భూపాలసై
శ్వర్యభోగంబులు । చాలలేదొ
మహనీయమణిమయ । మందిరాంగణవాస
సౌఖ్యసంతోషముల్ । చాలలేదొ
సకలసామంతా । జన్య సమూహంబు,
సలుపుచుండెడి నతుల్ । చాలలేదొ
త్రిలోకైకఘనుల । ప్రశంసాపాత్రము,
శౌర్యసాహసములు । చాలలేదొ

తే. గీ. పరుల కాంతలంబట్టుడి । పాపముగాదొ,
దోషము; పార్వతీదేవినిం । గూడఁ బట్ట
సాహసించుచు నుంటివి । శౌర్యవృత్తి
సన్నుతాంగదేవి మహిమంబు । నరయలేవొ,

నాథా! ఈప్రపంచమంతయు నాకు నీడనేయున్నది. నాయందు నీవు కరుణించి నీ పదసేవకు నన్ను దూరముగఁ జేసినను నిరంతరము నీకే హృదయమునందే సేయుచు సాధ్వినై యుంటిని. అట్టిచో నిప్పుడు సతీదేవినిం బట్టనేగి నాకు దురంతవేదనఁ గూర్ప వలదు.

జలం—నేను నీయెదుట నున్నంతవఱకును నేదియో యనవసరమైన సంభాషణ సేయుచునే యుందువు. నేనిదే కైలాసమున కేగి, సమయము వేచియుండి సతీదేవిని బంధించికొని వచ్చెదనుగాక! (నిష్క్రమించును.)

బృంద——హా నాథా! నాథా! (పరికించి) ఇంకెక్కడనాథుఁడు! ఈతఁడు నామాటలు పెడచెవిం బెట్టి శైలతనయార్థమై యరిగినాఁడు. ఇప్పుడు నేనేమి సేయుదును? ఎవ్వరిని వేడుకొందును? ఈతఁ డట్టియు కార్యము జేసి నేని త్రినేత్రుని కోపాగ్నిజ్వాలలందు బడి భస్మముగాక యుండునా! అక్కటా ఈతఁ డెట్టి సాహస కార్యము సేయ నెంచెను! (ఇంచుక యూరకుండి) ఇప్పుడు నేను విచారించుచున్నందువలనఁ బ్రయోజనము లేదు. నేనుగూడ నరిగి నాథుని యత్నమును గని పెట్టుచు నా శక్తికొలఁది వారింపఁ బ్రయత్నించెదఁగాక.

[నిష్క్రమించును]

ఇది తృతీయాంకము.






## —: చతుర్థాంకము :—

---

రం: ము:—(1) [కైలాసపర్వతప్రాంతవనములో సతీదేవి ప్రవేశము]

సతీ—(తనలో) పరమేశ్వరుని భార్యనైన నాకుఁగూడ సవతిపోరు కదా. మా కలహములుజూచి ప్రాణేశ్వరుఁడు పరిహాసము సేయుచుండును. ఇట్టి కలహములు స్త్రీలు తమలోదామే యంతరింపఁజేసికొనవలయునుగాని, మగవారికిఁ జెప్పుట యెంతయుఁ జులకన కదా! కలహ సందర్భమున నాగంగ నన్నుఁగూర్చి పలికిన యావాక్యము నాహృదయమున శంకాయానుమానము గలిగించుచున్నది. (ఆలోచించి) రుద్రాణినగు నన్నెవ్వఁడు బట్టసాహసించును? నాయనుమానమే నన్ను బాధించుచున్నదిగాని మరియొకటికాదు. (ఎదుటజూచి) నన్నిచ్చట నుండుమని చెప్పిపోయిన చెలికత్తియింకను రాకయున్నదేమి! వచ్చుచున్నదేమో చూచెదగాక. (నిష్క్రమించును.)

(జలంధరుఁడు ప్రవేశించును.)

జలం— (తనలో) నేను నిన్నటివరకు వేచియుండఁగా, నిప్పటికి పార్వతి యొంటరిగా నుండఁజూచుభాగ్యము గలిగినది. (ఎదుట జూచి) అదిగో, ఆయింతి (పరికించి) ఈమె సౌందర్యమద్వితీయమైనది!

ఉ. వేయితలంప నేమిటికి? విశ్వపదార్థములందు గల్గు బల్
సోయగ మొక్కచోట నిడి చూడగఁ గోర్కెజనించియుంటవా

నీయువతిప్రియుండు శశి । నీరరుహాద్యుపమానవస్తుల
త్యాయతబుద్ధిఁ గూర్చి వెల । యంగను జేసెఁ దళోదరీమణిన్.

ఇట్టి నారీమణి లభించుటచేతనే యీశ్వరుఁడు మహాదేవుఁడైనాఁడు. (ఇంచుక యూరకుండి) నే నిట్లాలోచించుచు నున్నందువలనఁ బ్రయోజనము లేదు. ఆలస్యము చేసితి నేని కార్యభంగము గును. సత్వరముగ నీమెను బట్టుకొని విమానముపైఁ బెట్టుకొని నిజనగరము చేరెదను. (సపరిక్రమించును.)

స:—ఆ! దురాత్మా! ఎవ్వడవురా నీవు? సాహసంబున నన్నుఁ బట్టవచ్చితివి. [అని పలుకుచుఁ సతీదేవియు వెంట జలంధరుఁడు ప్రవేశము]

జలం—(సతీదేవినిఁ జూచి)

ఉ. ఏను జలంధరుండ, రమ । ణీమణి నన్నెఱుంగవో తొ; నీ
మానితసుందరాకృతికి । మానసమందున జాలమెచ్చి; యా
సూనశరాగ్రికిన్ మిగుల । సొక్కి నినున్ గొనిపోవఁగోర్కెతో
నేఁట నేఁగుదెంచితిని । నీరజపత్త్రవిశాలలోచనా.

స:—(కోపముతో) ఓరీ! మాతృద్రోహీ! ఎట్టి సాహసకార్యము సేయు నెంచితివిరా! తల్లినగు నన్నే బట్టవచ్చితివిగా! నీవిట్టి పరమపాతకుఁడ వగుదువని తెలియక బ్రహ్మరుద్రాదులు నిన్ను మహైశ్వర్యవంతుని గాఁ జేయుటం జేసి యిట్లు దుష్కృత్యములు సేయుచుంటివి.

తే. గీ. తగని పురుషునకును దొడ్డ । తనము కూర్చ
నగవు పుట్టయె కాని సో । దలఁతి తనము
పిల్లకుక్కను దోడ్తెచ్చి । పల్లకి నిడి
యూరకిచ్చిన నది దివ్వె । లార్పు కాదె.

బాల్యమునందె నిను శ్రీహరిఁ జావదలంచియు; బరమేశ్వరుని మొగము జూచి యూరకుండుటచేత నిట్టివాడవైతివి - కానిమ్ము -

రుద్రుని కోపానలజ్వాలల కాహుతికాఁ గోరియే నన్ను నేడిట్లు బట్టుటకు సాహసించితివి.

జలం—సుదతీమణీ! ఈ యనవసరసంభాషణలో నేమి పనియున్నది? నే నొకమాటఁ జెప్పెదను వినుము.

సీ॥ ఆ హాస మొప్పంగ । నతిభయంకరమైన
భూతలంబు లుండెడి । ప్రేతభూమి
ఆహార మొసఁగ । నన్యులెవ్వరు దరి
జేరఁగాఁ జాలని । ఘోరవిషము
పానంబు దలంపఁ । బరిహాసమును సేయు
నిరతంబు దలయూచు । వృషభమూర్తి
బిచ్చమెత్తఁగ నెంచి । వేడ్కమై హస్తంబు
నరఁ ధరించినది యా । నలువ శిరము

తే॥ గీ॥ పాములే నగలు, హితులు । ప్రమథగణము
గాఁగ జరియించుచుండు నీ । కాంతుఁ జేసి
సౌఖ్యముల నీయఁజాలును । సారసాక్షి
రమ్ము పోదము నాదు పు । రమ్మునకును.

జాగుసేయక లెమ్ము. (సమీపించును.)

సతి—తులువా! దూరముగానుండుము పరమేశ్వరుని మహామహిమను నెఱుఁగక యిట్టి యకార్యమును జేయవచ్చితివి. నిన్ను నేనే దగ్ధము జేయఁగలుగుదును గాని, నాధు నాజ్ఞ లేక పోవుట చేతను, నీ భార్యయు, సాధ్వీశిరోమణియు నగు బృందను జూచియుఁ గరుణించితిని. ఇంతవఱకును దాపసుల నేచుచుఁ దత్పత్నులఁ బలిమిఁబట్టుచు నార్జించిన ఘోరపాపము చాలక నాకడకుకూడ వచ్చితివా?

జలం—సతీమణీ! నీవు నన్నిట్లు తృణీకరించి పలుకవలదు. నీ సౌందర్యమున కీశ్వరుఁ డెంతయుఁ దగనివాఁడు.

తే॥ గీ॥ ఉవిద జవ్వనివి సుఖంబు । లొల్లకీవు
బడుగు జోగికి భార్యవై । బరగితేల
రాత్రి ముఖమునఁ జంద్రతా । రాప్రదీప్త
మైన శర్వరి యరుణున । కగుని చెప్పుము.

ఈమాటలతో నేమిప్రయోజనమున్నది? రమ్ము. నాపురమున నన్నుగూడి సుఖించెదవుగాక! (సమీపించును)

సతి— నీ కాయువుమూడినది. ఇంచుక కాలమిచ్చట నిలచియుండుము. పరమేశ్వరుని మహిమ నీకుఁ దెలియును.

బలం—అతని మహిమ తెలియకేమి?

క॥ తనువు విరూపాక్షము, పు
ట్టనఁ గన రాదేరికిని ది । గంబరత నరుం
గనగును, ధనమను మాటయె
గనరా దతని మహిమంబు । గానని జగతిన్.

శ్రీకంఠునికి గట్టిపెట్టి నీ తలిదండ్రులు నీకెంతయు శోకముగూర్చిరి. నిరంతరమును మణిసౌధంబులయందు మెలఁగు నీచరణములాతనితో పితృవనంబున మెట్టుట కెట్లోర్చుచుంటివి?

క॥ శ్రీచందనాస్పదములగు
నీచనులు శ్మశానభూమి । నెగడుటకంటెన్
నీచం బొందు గలుగునె యా
హా! చపలాక్షిరో సుఖంబు । నట్టిది యౌనే.

సతి— ఓరీ! దుర్మతీ! బీదయు, సంవర్ధేతువుచు శ్మశాన సంచారియు, జగత్పతియునగు శివుని మహాత్త్వము నీబోటి మందు లెఱుంగఁ జాలరు. (ఇంచుక యూరకుండి) నీతో నాకుఁ బనేమి? (ఇంచుక నడచును.)

జలం—శైలతనయా! నాచేఁ గోరఁబడిన నీవెచ్చటి కరిగెదవు? నిలువుము. నిన్నిప్పుడే నాపురికిఁ జేర్చెద. జలంధరుఁడు పట్టినపట్టు విడుచువాడు కాడు (సమీపించి పట్టుకొనఁబోవును)

సతి—(పరమేశ్వరుని నుద్దేశించి) హా! పరమేశ్వరా! నీవెచటనుంటివి? ఈ జలంధరుఁడు దుర్మార్గుఁడై నన్ను బట్టఁదలంచుచున్నాఁడు. సత్వరముగ వచ్చి రక్షింపుము.

జలం—

మ॥ జలజాక్షీ భవదీయనాథుఁడగు నా । శంభుండె యేతెంచి యు
జ్వలదర్పంబున నిల్వనిమ్ము పుడమి । న్స్వర్గంబునన్ సంగర
స్థలినిన్ వానిని రూపుమాపి సురబృం । దం బెల్ల భీతిల్లగా
బలిమిన్ నిన్ గొనిపోదు నాదుపురికిన్ । బల్మాటలింకేటికిన్.

(పట్టుకొనఁబోవును.)

సతి—(తప్పించుకొని అటునిటుజూచుచు) ఓరీ! కలుషాంధకారప్రవృత్త హృదయా! దూరముగానుండుము.

జలం—హిమగిరితనయా! నేను రుద్రునికి భయపడుదునని తలంచితివేమో (దగ్గరకుబోవును)

(తెరలో)

చెలీ! పార్వతీ! పార్వతీ! ఇదియేమి, నిన్ను బట్టదలంచుచున్న యా దురాత్ముఁ డెవఁడు? పరమేశ్వరుఁడు ప్రాంతము నందె యున్నవాఁడు. అతని భంగించెదఁగాక నీవు భయపడవలదు.

సతి—(తనలో) ఇంక భయములేదు. ఈదురాత్ముడు నాథుని క్రోధానలజ్వాలల కాహుతియగును.

జలం—(తనలో) ఓహో! ఈమె చెలికత్తె యీప్రాంతమునందే యున్నదికాఁబోలు. ఈవార్త శివుని కెఱిఁగించిన నాతఁడు రాఁగలఁడు.

ఇప్పుడు నేనేమి సేయుదును? (ఆలోచించి) శివుఁడొక్కఁడే కాదు. ఆతనికిఁ దోడు కెవరైన రానిమ్ము. సతిని మాత్రము విడువక యుండుదు గాక! సాధ్యమగునంతవఱకు కాలుఁడు రాకమునుపే యీకాంతను బంధించుకొనిపోయెదను. (సతిని సమీపించి) లెమ్ము. లెమ్ము. ఇంకఁ గాలహరణమునకు నాచిత్త మోర్వదు.

సతి—దుర్మతీ! నీకుఁ గాలము సమీపించినది. ఉండుము.

( తెరలో )

మ. సురముఖ్యస్తవనీయమైన సతినిన్ । సంసార బంధింప, నే
దురితాత్ముండవు దలంచె, వానిని జగ । ద్ద్రోహిన్ నిమేషంబులో
సురబృందంబు నుతింప శూలమున ని । చ్చేఁ జావగా జేతు; ని.
ర్భరమౌ శోకపుదవానలంబును సహిం । పన్ శక్తుఁ డెవ్వాఁడగున్.

పర—(పైపద్యమును జదువుచుఁ బ్రవేశించి యిటునటు జూచుచున్నాఁడు.)

పార్వ—(పరమేశ్వరు నుద్దేశించి) హా! నాథా! దుర్మార్గుఁడగు జలంధరునిచేఁ జిక్కిన నన్ను రక్షింపుము.

పర—(జలంధరునిజూచి) ఓరీ! దుర్మతీ! నీవా! ఇట్టి సాహసకార్యమునకు సాహసించితివి.

ఉ. భామిని నీవిధంబునను । బట్టఁగ నెంచిన నిన్ను మామకో
ద్దామ క్రుధాగ్ని కాహుతిగఁ । దప్పక చేసెద జూడు మిప్డు సా
ధ్వీమణు లెల్లరున్ మదుల । భీతిని వీడి చరింపఁగా, ముని
స్తోమము గ్రూరుఁ డీల్గె నను । చున్ ముదమందగ దుర్మదాధమా.

(సమీపించి) ఓరీ! జలంధరా! ఇంతవఱకును నీవు చేయుచుండిన దుష్కృత్యములఁగూర్చి నేను వినియు, నెవరు జేసినపాపము వారే యనుభవింతురని యూరకుంటిని. ఇప్పుడు నీవీ తుషారక్షోణి

భృత్యకన్యకను గూడ బట్టుటకు సాహసించితివిగా! ఇంతకును నిన్నన వలసినదని యేమియు లేదు. నాకారణంబున జనించిన నీ వనామకుండవై యుండకుండ, నిన్నొక రాజుగాఁ జేసి, వరంబులిచ్చి నందుకు మాకుఁ గలిగిన ప్రతిఫల మిదియే కదా!

తే॥ గీ॥ ఎఱుక మాలిన వారల । కెంత మేలు
గూర్చిన దానిఁ దెలియంగ । లేరు జగతి
బిడ్డయని మెంచి మెడమీద । బెట్టుకొనిన
దేహమంతయు జెఱచుఁగా । దే! దురాత్మ.

జలం—(పరమేశ్వరునిఁ జూచి) శంకరా! నీ వాక్యముల కిచ్చుట భయపడు వా రెవ్వరును లేరు. భాగ్యభోగంబులు లేక, జోగివలె నిరంతరమును ప్రేతభూమిని విహరించు నీ కీసౌందర్యవతియగు నెలనాగ యేల? ఈమెను నాకొసంగుము. ఎట్లయినను నీ హిమాచలాత్మజను గొనిపోవుటకే వచ్చితిని. నీవు మాటలతో నొసంగవేని నిన్ను రణంబున నిర్జించియైనఁ దోడ్కొనిపోయెదను.

పర—ఛీ! మాతృద్రోహీ! ఇట్టి యవ్యక్తప్రలాపంబులాడకుము.

మ. సముదాటోప పతంగపుంగవవిభా । స్వద్దీర్ఘ చంచూసమ
ద్యమునం దల్ప ఫణావిజృంభణనట । త్కాకోదరంబట్లు శౌ
ర్యమదోద్రేకుఁడవైచు నన్నిపుడు జ । న్యక్షోణినిం దాకఁ జి
త్తమునం దెంచితివే దురాత్మ యిఁక నీ । దర్పంబు వారించెదన్.

నాపరాక్రమమునుగూర్చి నీ విదివఱ కెన్నఁడును వినియుండ లేదు కాబోలు?

జలం—వినియుండ కేమి?

మ. గరిమన్ నిన్ను దిరించు వీరవరుఁ డా । కృష్ణుండైన లేకుంటచే
నరుదారన్ భవదీయశౌర్య మనివా । ర్యంబై నుతింపఁబడ్యా శా

స్వర సంస్తోత్రిత గర్వమై కడుబ్రకా । శంబయ్యె; నింకన్ జలం
ధరుబ్రెూలన్ భవదీయ విక్రమము వ్య । ర్థంబౌ నుమావల్లభా.

ఈ జలంధరుఁడు రాజాధిరాజై విలసిల్లుచుండె నని యెఱుఁగవా
యేమి?

పర—ఓరీ! నీవు రాజాధిరాజు నని గర్వించుచుంటివా? ఇటువినుము.
చిత్రాభరణపటస్థితిఁ బ్రకాశించుటయుఁ, జామరానిలావృతినిఁ గను
టయు, మదోన్మత్తకాయమున విజ్రుంభించుటయు, మానస్వభావమున
నుండుటయు, వాద్యధ్వనితో స్వారి వెడలుటయు, బరుల దూరంబు
గాఁ దరుముటయు, దనవారివాక్యములు విని తలయూచుటయుఁ,
జుట్టును ననేకులచేఁ బరివేష్టింపఁబడుచుండుటయు, రాజమాత్రుఁడ
నైన నీకే యుండ లేదు. ఇవియన్నియు గంగిరెద్దునకుఁగూడ నున్నవి.
ఓరీ! గర్వచిత్తా! వివేకజ్ఞానశూన్యుఁడవైన నీవు రాజు వైననేమి
కాకున్న నేమి?

సతి—(పరమేశ్వరునితో) నాథా! దుష్టచిత్తుఁడగు వీనితోఁ గాల
యాపన మేల?

జలం—నిజమే. వృథావచనములతో నేమిపనియున్నది? (పరమేశ్వ
రునిఁజూచి) ఓయీ! పితృవనవిహారీ! నే నీ శైలసుతను దోడ్కొని
పోవుటకు నీవు సమ్మతింతువా? లేక రణంబునే నిల్చి నాతోఁ
బోరెదవా?

పర—(కోపముతో) దురాత్మా! ఏమనిరా ప్రేలితివి? (త్రిశూలము
చేఁ బొడువఁబోవును)

జలం—(తప్పించుకొని) రమ్మా. రమ్మా.

ఉ॥ ఆహవనామకాధ్వరము । నందు మదీయభుజోజ్వలత్సనా
నాహతచాపము త్తనిశి । తాస్త్రనుహాగ్నికి నిన్ను నివ్వ డా

జ్యాహుతిగా నొసర్చుచు ర । యంబున నీమెను గొంచుబోదు మ
త్సాహసవిక్రమక్రమము । శౌర్యము జూడుము భూతనాయకా.

పర—(కోపముతో) నీతో రణముగూడ సేయవలయునా ?

మ॥ తరుణీ సాధ్విని లోకమాతను, సురేం । ద్రస్తుత్యపాదాంబుజన్
బరిభావింపగ శాపమూనసుడవై । భావించుటే గాక, సం
గరమున్ జేయగ నెంచుచుంటివె భళి । కష్టాత్మ నాశింద, భీ
కరశక్తిన్ బొలియింతు నిన్నిపుడె లో । కంబుల్ ముదంబందగన్.

దుర్మదపత్తుండవగు నిన్నింకను బ్రతుకనిచ్చితినేని, లోకముల కపకారము జేసినవాడనగుదును. ఇదిగో ! శక్తిని బ్రయోగించి నీ ప్రాణముల హరించెదగాక.

[ అంత శోకదరగా బృంద ప్రవేశించును ]

బృంద—(పరమేశ్వరుని పాదములపైబడి)

తే॥ గీ॥ శంకరాయ భక్తజన వ । శంకరాయ
కంధరాయ మహానీల । కంధరాయ
పురనిశాచర కర్కశ । పురహరాయ
పార్వతీరమణాయ తు । భ్యంనమోస్తు.

మ॥ నతసర్వామరశీర్ష సన్మకుటసం । తానంబులన్ వేనిరా
జితతుల్ భానుని మించుతేజమున సం । దీపించుచుండెన్, సు
స్తుతవాణీమునిభక్తమానసగృహ । స్తోమంబులన్ దివ్యమై
నుతినిం గాంచెను నట్టి నీపదములన్ । గొల్తున్ సదా భక్తితోన్.

పరమేశ్వరా ! సర్వాంతరాళానువర్తి ! పుణ్యమూర్తీ ! బుధ త్రాణశీలా ! భవదీయపాదారవిందస్మరణము, ఖగేశ్వరుండహి వ్రాతమును హరించు చందమున, సమస్తపాపములను నశింపు

జేయును. ఆర్తనైన నేను నీ శరణంబువేడుచుంటిని. నీవు కోపమున కన్నుదెఱచి చూచితివేని, యీతఁ డెంతవాఁడు? నా నాథుఁడు సద్గుణమూర్తియని నేను చెప్ప సాహసింపను. నా సాధ్వీత్వము దిలకించియైన నీతనిని రక్షించి నాకుఁ బతిభిక్షఁబెట్టుము.

తే॥ గీ॥ అతని జన్మముఁ గారణం । బనఘ! నీవు
గావె! నీకటాక్షంబునఁ । గాదె యిట్టి
వైభవంబునుబొందుచు । వరలుచుండె
నీవు పెట్టిన దీపంబు । నీవె యార్ప
దలఁచు టియ్యది ధర్మమే । లలితతేజ.

(పార్వతిఁ జూచి) హే! జగజ్జననీ! భవన్మహామహిమ నెఱుంగ లేక, నీయెడల నకార్యము సేయ నెంచిన నా ప్రాణేశ్వరునిఁ గ్షాప దము. (జలంధరుని సమీపించి) నాథా! ఇది యేమిసాహసము? జగజ్జనని యగు సతీదేవినిఁ బట్ట సాహసించితివి? ఒక్కసారి మహేశ్వరుఁడు కోపదృష్టితోఁ జూచెనేని, శోకములాగునా? చాలుఁ జాలు. సాహసము. ఇంతలుతఁ జేసిన సాహసము చాలక, యే దేవాది దేవుని మహితకరుణఁ గాంచఁగోరి మునీంద్రులు పరమనిష్ఠాగరిష్ఠులై తపము సేయుచుందురో యట్టి భగవంతుఁడగు నీలకంఠునితోఁ గయ్యముగూడ సేయ నెంచితివా? నాకు వైధవ్యాగ్నిష్టాలంకారము గూర్పఁదలంచి యిట్టి సాహసోద్యోగమును బూనితివని తలంచెదను ప్రాణేశ్వరా! ఇంకనైనఁ జేసిన యపరాధమును మన్నింపుమని యీ పురాణదంపతులను బ్రార్థింపుము.

జల — రమణీ! ఈ సమయంబున నీవిక్కడి కేలవచ్చితివి? నాయుద్యమమున కేలభంగ మొదవించెదవు? రణమున త్రిపురహరుఁడే గాదు. చతుర్దశభువనములును నెక్కఁబెట్టున నెత్తివచ్చినను వెనుదీయువాఁడను గాను పొమ్ము.

పర — బృందా! గురుద్రోహియగు నీతనికి నాతోఁ గయ్యమొనర్పుటకిచ్చ జనించినది కాబోలు. రానిమ్ము. మదీయ కోపాగ్ని కింధనమగుఁగాక!

బృంద — తుషారభృత్కన్యకారమణా! నన్నుఁజూచియైన నీవాగ్రహం బును విడువుము. పుత్రుఁడపరాధ మొనర్చినఁ దండ్రి రక్షించవలయును గదా! ఇతఁడేమి? నీతోఁ గయ్యమొనర్చుటేమి?

సీ॥ భక్షింపవే లోక । పరితాపకమును పావ
నాభీలహాలాహ । లానలంబు
రక్షింపవే యార్త । రక్షాయనుచు నీదు
పదముల సేవించు । భక్తసమితి
శిక్షింపవే సుర । శ్రేణికి సౌఖ్యంబు
నమరఁజేయఁగ త్రిపు । రాసురులను
వీక్షింపవే శౌర్య । విశదార్థమై భస్మ
మైపోవునట్లు ర । మాకువరుని
తే॥ గీ॥ నన్ను రక్షింపవే యింక, న । నాథనైన
బ్రదుకజాలను గాన నా । భర్తచేసి
నట్టి దుష్కార్యమెందక । యాత్మలోన
భక్తజనమానసోల్లాస । పార్వతీశ.

సతి — (పరమేశ్వరునిఁజూచి) నాథా! జలంధరుఁడు నాయెడల దుష్కృత్యము సేయఁదలంచినను, సాధ్వియగు బృందనుజూచి, యాతనిఁ గరుణింపనగు.

పర — (బృందనుజూచి) బృందా! నిన్నుఁజూచి, నీనాథునిరక్షించక దప్పదయ్యె. (జలంధరునిఁజూచి) జలంధరా! ఇట్టి యవివేకకార్యముల నింక నెన్నడును సేయఁదలంపక యుండుము. బృందయొక్క పాతివ్రత్యమే నేడునిన్నుఁగాచినదని తలంపుము. పొమ్ము.

బృంద — ధన్యురాలనయితిని. పార్వతీ పరమేశ్వరులారా! నిరంతరమును మీదివ్యనామసేవ నా హృదయంబునఁ బాదుకొని యుండునట్లనుగ్రహింపుడు.

సతి — సాధ్వీ! పోయిరమ్ము. శుభమగుఁగాక! (పరమేశ్వరునిగాంచి) ప్రాణేశ్వరా! ఇంక మనమరుగుదము.

(ఇరువురును నిష్క్రమింతురు.)

బృంద——నాథా! నేఁజెప్పిన మాటలు వినక పరమేశ్వరినిఁబట్టఁ దలంచి వచ్చితివి. పరమేశ్వరుని కాగ్రహము పూర్తిగావచ్చినచో నాగతి యేమగును? ప్రాణేశ్వరా! ఇఁకను నీచిత్తమునిట్టి యధర్మకార్యము లందు బ్రవేశపెట్టుచు నాకుఁజింతఁగూర్పక కరుణింపుము. రమ్ము.

జలం——[తనలో] ఆనాడు మునిపత్నియగు చారుమతిని భంగము నేయఁదలంచ, నడ్డుపడినది. నేఁడీసతీదేవి విషయమునఁగూడ నట్లే చేసినది. ఇది బ్రదికియున్నంతవఱకు నాయుద్యమము లన్నిఁటికిని భంగమొదవుచునే యుండును. కావున నేమాయోపాయముననో, దీనినిఁ గడతేర్చవలయును. (ఆలోచించి) సరే! ఇందుకు మంచియుపాయమే తోచినది. ఈ పర్వతముపైనున్న చిత్రములఁజూపుచు, నామూలకుఁ దోడ్కొనిపోయి దీనిపైనుండి సముద్రమునఁబడునట్లు ద్రోసివేసెదను. (ఇరువురు నిష్క్రమింతురు)

రంగము. (2) [కొండపై జలంధరుఁడు - బృందయుఁ బ్రవేశము]

బృంద——నాథా! ఆలోచించుచుంటివేమి?

జలం——(తనలో) చిత్తమున నున్న కోపమాపాతయు బయలు పెట్టరాదు. (ప్రకాశముగా) రమణీ! ప్రకృతిసౌందర్యమున కద్భుతమందుచున్నాను. ఇటుఁజూడుము. చిరత్నరత్నమయ నిశ్రేణికాశ్రేణి భ్రమదాభ్రతలోత్తుంగశృంగంబు లెట్లున్నవో గరిటివా? ఆక్రింద భాగమీక్షింపుము. ఘుమఘుమ పరిమళించు వితాంతవాసంతికా మల్లికాదివల్లికామతల్లికల నల్లిబిల్లిఁగొని, మదనకదనంబున నదమదంబులగు త్రిదశవిటీవిటపటలంబున కప్రయత్నంబున బ్రాప్తించిన సంకేత సదనంబులనం దనేరుపొదలెంత చిత్రముగ నున్నవో!

బృంద——నాథా! ఇటుఁజూడుము. తమ చక్కదనమునకు విద్యాధరీకాంతల మక్కువ బడ జేయుచు, ధమకఱచిన యురగసంతతులఁ బాఱవైచి, వానిని మాటిమాటి కక్షిణపక్షి విక్షేపణంబుల నడంచియుఁ

జంఘాపుటంబులఁ బొడిచియుఁ బరుషచరణాగ్రంబుల నడచియు, ఖరనఖరంబులఁజీరియు, దీటుని కినుకతో వివిధగతులఁజెలంగు బర్హిగణము లెట్లున్నవో!

జలం—సహజ సౌందర్యమునకేమియు సాటిరాదుకదా! ఆవనంబునగల మృగసంతతులపై నొకసారి దృష్టిఁబఱుపుము.

సీ. గండభేరుండముల్ । గమరంతు లిడఁజూచి
సత్వరంబుగఁ బాఱు । సింహచయము
శరభంబులేగుడి । చప్పుడు వినవచ్చి
తరులచాటున డాఁగు । హరిగణంబు
హరిగణధ్వానంబు । నాలించి నిశ్చేష్ట
త వహించి నిలచు ను । త్తగజసమితి
మత్తసామజంబుల । మార్గంబు నీక్షించి
శీఘ్రంబుగాఁ బాఱు । చిఱుతగములు
తే. గీ. చిఱుతగంతుల చప్పుడు । చెవికి సోఁగల
చెంగు చెంగున దాటుచుఁ । జింకతతులు
గలిగి మిగుల చిత్రంబుగా । జరగుచున్న
సమ్మహావనిఁగంటివా । యబ్జనేత్రి!

ఇంకను మనమామూలనుండి చూచినచో మఱింతచక్కఁగాఁ గానిపించును. గమ్ము. (ఇంచుక నడచుచున్నారు)

బృంద—(క్రిందకుఁజూచి) ఈ పర్వతాగ్రమునుండి, సముద్రమునందు చూచినచోఁ గన్నులు తిరుగుచున్నట్లుండును.

జలం—తరుణీ! ప్రభాకరబింబము జలములయందెట్లు ప్రతిఫలించుచున్నదో చూచితివా?

బృంద—(సముద్రమునుఁ జూచుచుండును)

జలం—(లోపల) ఇదియ సమయము.

[బృందను సముద్రమునఁ బడునట్లు ద్రోయును.]

బృంద—హా! (అనుచు సముద్రమునఁ బడుచున్నది.)

జలం—నేఁదలఁచిన పనియైనది. (నిష్క్రమించును)

(తెర లేచును)

సముద్రము:—[బృందజలములలో నిటునటు గొట్టుకొనుచు నుండఁగా విష్ణుమూర్తి - ప్రవేశించును.]

బృంద—(జలములనుండి) నారాయణా! నారాయణా!

విష్ణు—(జలమునందున్న బృందనుజూచి తనలో) అక్కటకటా! దురాత్ముండగు జలంధరుఁడీ బృందయెడల నిట్టి దుష్కృత్య మొనర్చినాఁడు! నేనిప్పుడీమెను రక్షించెదఁగాక. (జలములలోదిగి) సాధ్వీమణీ! భయమందకుము. ఆర్తరక్షణుఁడనైన నేను నిన్నురక్షించుచున్నాను. (బృందనుదీసికొని యొడ్డునకు వచ్చును.)

బృంద—(విష్ణుమూర్తినిఁజూచి) శాశ్వతసౌఖ్యమునందుటకై విధిప్రేరణమున నింకఁబడిన నన్నురక్షించితివేల? మహాత్మా! కరుణామయుండవైన నీవెవ్వరవో యెఱుఁగవచ్చునా?

విష్ణు—బృందా! ఇంతలోనె మఱచితివా!

తే. గీ. ఏను నీహృదయంబున । నెపుడు నిల్చి
యుంటి; నీవు నామదిలోన । నుంటి వెపుడు
నఖిల భక్తులహృదయంబు । లందు నలరు
నన్ను నెఱుఁగకుంటివె నీవు । నాతిమిన్న.

బృంద—(తనలో) ఓహో! ఈతఁడు శ్రీమన్నారాయణుఁడు. మున్నొకపారి యీ మహానుభావుండు తన జగత్కల్యాణరూప సందర్శనము నాకొసంగి, మదీయగుణపరీక్షార్థమై నన్ను మోహించినట్లు నటించి

నాడు. భగవంతుడు భక్తజనమానసంబుల ననేకవిధంబులఁ బరీక్షించుచుండునుగదా! (ప్రకాశముగా) ఆర్తరక్షామణీ! భవదీయ దివ్యమంగళవిగ్రహ మొకసారి దర్శించియుండియు, నేడజ్ఞానంబునఁ బడి కనుగొనలేకపోయితిని. మన్నింపుము.

మ॥ కలనైనన్ సులభంబుగాదు భవదాకారంబు దర్శింప, నా
నలినప్రోద్భవ ముఖ్యదేవతలకైనన్ నేను మల్లోచనో
త్పలముల్ ధన్యతగాంచి మించగ భవద్భద్రాయితాస్యేందుమం
డలి వీక్షించితిఁ గ్రమ్మరన్ విపులపుణ్యాంబెట్టిదో మాధవా.

సముద్రమునఁబడిన నేను ప్రాణముల బాసియుంటినేని నీ సాన్నిధ్యమునఁ జేరియుందునుగదా! నన్నేల రక్షించితివి?

విష్ణు—భక్తరక్షణము నాయుద్యోగమేకదా! (తనలో) ఈమె జలంబునఁ బడుటకుఁ గారణమడిగిన నేమని చెప్పునో (ప్రకాశముగా) నారీమణీ! నీవి జలరాసిం బడుటకుఁ గారణమేమి?

బృంద—భగవంతా! నా పురాకృతప్రారబ్ధమని చెప్పుటకంటె వేఱే మియుఁ జెప్పఁజాలను.

విష్ణు—పతి నిరాదరణమే కారణమని యూహించెదను.

బృంద—(మాటలాడకయుండును.)

విష్ణు—నిరుత్తర మంగీకారసూచకమా!

బృంద—దేవా! ఇప్పుడీ యనవసరమైన సంగతియేల?

విష్ణు—బృందా! నీభర్త చేసిన యకృత్యము నీవు చెప్పక దాచినచో నాకుఁ దెలియ దనుకొంటివా?

బృంద—సకలాంతర్యామి వగు నీకుఁ దెలియనివిషయ మేమున్నది?

విష్ణు—నీయం దట్టి నిరాదరణభావము వహించిన పతినిఁ బట్టుకొని యేల ప్రాకులాడెదవు? జగన్మియామకుఁడ నగు నాయభీష్టము, దీప్తి తుభంబుల బడయ తలంపవేల?

బృంద—లోకేశ్వరా! నాహృదయ మిదివఱకే నీకుఁ దెలిసియున్నది. ఇంకను నన్నేల పరీక్షించఁ దలంచెదవు?

ఉ. దేవుఁడవైనఁగాని మఱి । దేవుని యబ్బవు నైనఁగాని; నా
భావ మధర్మమార్గమున । వర్తిలనెంచను వేయునేల నీ
వీవిధిఁ బెక్కుభంగులను । నేల పరీక్షను సేతువయ్య ల
క్ష్మీవర! భర్తృసేవ సతి । కిన్ సకలార్థము లిచ్చుగాదొకో!

విష్ణు—పోనిమ్ము. ప్రాణదానముచేసినందులకు నాకేమి యుపకారము సేయుదువు?

బృంద—మహాత్మా! ఉత్తమపురుషు లెప్పుడును నుపకార మొనర్చి ప్రత్యుపకారమును గోరరు. భువనాధీశ్వరుఁడ వగు నీకు నేను ప్రత్యుపకారము సేయఁజాలినదాననా! నీపాదారవిందసేవపై నిరంతరము నాచిత్తము దగిలియుండునట్లు మాత్ర మనుగ్రహింపుము.

విష్ణు—అట్లయిన నీవిప్పుడు నా యాజ్ఞను సరింపుము.

బృంద—అధర్మముగాని దెట్టికార్యమునైనఁ జేసెదను.

విష్ణు—నీవిప్పుడు బృందావనంబున నుండుము. నీనాథుఁడు తనంతతానే నీకడకు రాగలఁడు.

బృంద—పతి పదసేవ చిత్తమునందుఁ జేసికొనుచు, భగవదాజ్ఞను సరించెదగాక!

(నిష్క్రమింతురు)

రంగము:—(3) వైకుంఠము—విష్ణుమందిరముముంగిట:—
ఇంద్రుఁడు.- గాలవుఁడు - ప్రవేశము.

ఇంద్రు—మునీంద్రా! గాలవా! జలంధరుఁడుసేయు దుష్కృత్యములు నానాటికి హెచ్చుచున్నవిగాని తగ్గుటలేదు. ఇంక నెన్నాళ్లోపికఁ బట్టఁగలము?

గాల—ఆతని దుష్కృత్యములన్నియు శ్రీమన్నారాయణుఁడు చూచుచుండియు నిట్లు శాంతివహించి యుండుటకుఁ గారణ మూహింపఁ జాలకయున్నాను.

ఇంద్రు—తాపసోత్తమా! "అడుగనిదే యమ్మయైనను బెట్ట" దను సామెత నెఱుంగవా? (ఆచ్చెరువు యూరకుండి) ఇప్పుడు దానింగూర్చి యోచింపనేల? భగవంతుఁడగు శ్రీహరికి జలంధరునిఁగూర్చి విన్నవించితిమి. కరుణాసముద్రుఁడగు నాతండెట్లు చేసినను సరే.

గాల—(యెదుటఁజూచి) భగవంతుఁడు మందిరమున లేఁడాయేమి? అయినను నిట్లు బిలచిచూచెదఁగాక?

(ఏకాంటఁ జూచుచు)

సీ॥ మామొరాలింపవు । మహనీయ వటపత్ర
 సీమపైనిద్రకుఁ । జేరినావొ
కరుణఁజూపింపవు । కమలాలయాదేవి
 నెడబాయజాలక । యొసఁగినావొ
కాపాడనెంచవు । నీపదాంబుల భక్తిఁ
 జాతించు వారికిఁ । జిక్కినావొ
రక్షింపఁజూడవే । రాక్షసాధమునైన
 నాశమునఁగూల్ప । వేఁగినావొ
తే॥ గీ॥ శాకయుండిన నారీతిఁ । గొలువఁ జిత్తుఁ
 డై జలంధరుఁ డొనరించు । నట్టి క్రూర
 కార్యములఁ గాంచుచుండియు । గానట్లు
 సైచియుంటివి యిదియేమి । జలరుహాక్ష.

ఇంద్రు—అదుగో! శ్రీమన్నారాయణుఁడు. మనకు దర్శన మొసంగుట కిట్లువచ్చుచున్నాడు.

(విష్ణుమూర్తి ప్రవేశించును)

ఇంద్రు—(విష్ణుమూర్తినిఁజూచి) లక్ష్మీకళత్రా! వందనము లర్పించుచున్నాము.

విష్ణు—మహేంద్రునకు శుభమగుఁగాక! (గాలవుఁ జూచి) మునీంద్రా వందనములు. (ఇంచుక యూరకుండి) మహేంద్రా! (గాలవునిఁ గాంచి) తాపసోత్తమా! ఈ యాసనము లధిష్ఠింపుడు.

(అందఱును నాసీను లగుదురు.)

విష్ణు—అమరలోకవిభుండగు నీవును తాపసోత్తముఁడగు నిగాల వృందును నేదియో యొక్క విశేషకార్యమునకై యేతెంచిరని తలంచెదను నేను మీ యెడలఁ జేయవలసిన కార్యమెద్ది?

గాల—ఇందిరారమణా! సర్వము నెఱింగియుండియు మాచే విని గోరి యడిగెదవు? జలంధరుని దుష్కృత్యములలో నీవెఱుంగని వేమున్నవి?

సీ॥ ఆలింపవదియేల ౹ యాశ్రమంబులఁ జొచ్చి
సంయమీంద్రులఁ బెట్టు ౹ శ్రమల నెల్ల
అరయకుంటి వదేల ౹ యజ్ఞవాటిక లెల్ల
నేలమట్టము జేయు ౹ నీచగుణము
జాలిఁ బూనవదేల ౹ సాహసంబున లోక
ములనేచు దుర్మార్గ ౹ ముదిలకించి
చెవిఁ జేర్పవదియేల ౹ శ్రీహరీ యని వేడు,
తాపస సతుల యా ౹ర్తారవంబు
తే॥ గీ॥ అన్నియును జూచుచుండియు ౹ మిన్నకుంటి
వేల? ఆజలంధరుఁ డున్న ౹ వేల? నీవు
గాక మాకు లోకముల ర ౹ క్షకుఁ డెవండు?
శ్రితజనావనశీల! ల ౹ క్ష్మీకళత్ర.

నారదుఁడు—(ప్రవేశించి విష్ణుమూర్తినిఁ జూచి) నిజమే నిజమే! జలంధరుని దుష్కృత్యము లపారములుగ నున్నవి.

తే॥ గీ॥ తనకుఁ దల్లి యౌనని యైనఁ ౹ దలఁపకుండ
శంభురాణినిఁ బట్టంగ ౹ సాహసించె

యిట్టి కార్యంబె చేసిన । హీనునకును
వరమునీంద్రులపత్నులే । పాటివారు
గొప్పమొదల లోఁగొనఁ । గొట్టు మీను
నకుఁ గలపతెప్ప లగయజం । తికలు గావె.

ఇంద్రు—నారాయణ! ఆజలంధరుఁడు తాపసాశ్రమము లందుఁ బ్రవేశించి చేయుచున్న దుష్కృత్యముల వచింప నలవికాదు. ఈమధ్య తన దండగములమరలోకము పైనఁగూడ బ్రారంభించినాఁడు. అమరకాంతలనుగూడ బాధింప మొదలిడినాఁడు. ఒక్కఁడయ్యును సంగరమునకు వెనుదీయఁడు. పరాజితుఁడుగాఁడు.

గాల—తాపసాశ్రములఁ బ్రవేశించి మునిపత్నుల బట్టిగొనిపోవు తరిని, మునుల కలుకవొడమి బృంద సాధ్వీత్వమునకు భయమంది శపియింపఁజాలకయున్నారు. ఇంతకు మున్న సాధ్వియగు బృందయాతనికడ నున్నప్పుడు శక్తియున్నంత వఱకిట్టి యకార్యములుజరుగకుండఁజేయుచుండెను. ఇప్పుడాసాధ్వి దుర్మార్గుఁడగు జలంధరునిచే సముద్రమునఁ ద్రోయఁబడి, నీచే రక్షింపఁబడి బృందావనమునుండి, నీయందుఁజిత్తముఁజేర్చి, క్రూరుఁడైనను దనపతి కెవ్వరివలనను హాని కలుగకుండుగాక యని నిరంతరతపోవ్రతయై యున్నది.

ఇంద్రు—భగవంతా! ఇంక నీవా జలంధరునివిషయమై ప్రయత్నించక పోయిన, సాధ్వీమణుల మానరక్షణమునకు మార్గము లేక యుండును.

విష్ణు—మహేంద్రా! జలంధరుని దుష్కృత్యము లన్నియు నే నారయుచు నేయుంటిని. బృంద మహాసాధ్వి. ఆమె సాధ్వీత్వమున కొక్కింతయేని భంగము గలుగనిచో జలంధరుఁ డేహానియుఁ బొందఁడు.

ఇంద్రు—దేవా! సకలామరమునిజనార్థమై నీవీ కార్యభరమును బూనవలెను.

విష్ణు—(తనలో) ఇదియు నొకమేలె. (ప్రకాశముగా) లోకహితార్థమై యీకార్యంబునకుఁ గడంగెదనుగాక! (నారదునిఁజూచి) నారదా!

ఈవిషయమున నీవుగూడ నాకుఁ గొంత సహాయము సేయవలసి యున్నది.

నార—భగవదాజ్ఞ శిరమున దాలునుగదా.

విష్ణు—నీవరిగి జలంధరుని బరమేశ్వరునిపై యుద్ధమున కరుగఁ బ్రేరేపింపుము.

ఇంద్రు—ఇట్టి కార్యము లన్న నీ మహాత్మునకు సంతోషమేకదా! (ఇంనుక యూరకుండి) దేవా! ఇఁక నాకాజ్ఞనిమ్ము.

విష్ణు—శుభమగుగాక!

(గాలవుడు - ఇంద్రుడు - నారదుఁడు - నిష్క్రమింతురు)

విష్ణు—(తనలో) నేను జలంధరుని వేషముతోడ బృందను జేరి వంచింపవలయును. (ఆలోచించి) కానిమ్ము. తుదకీయుద్యోగ మెట్లు పరిణమించునో చూచెద.

(నిష్క్రమించును)

ఇది చతుర్థాంకము.



ఆనాఁడు జలరాశియందు నీవు నన్ను ద్రోసినప్పుడు భగవంతుండగు శ్రీమన్నారాయణుండు నన్ను రక్షించి యుండనిచో నాకీవిచారమే యుండదు. ఆమహాత్ముండు నన్నేల రక్షించెనా యని చింతించుచుంటిని. నాథా! మొన్న నారదుండు నాకడకరుదెంచి నీవొనర్చుచున్న దుష్కృత్యములఁ గూర్చి చెప్పిన విని నేనెంతయు విచారించితిని. నేనేమి సేయుదును? ఇంక దేవతలందరును నీపై నలిగి యేమి సేయుదురో కదా! నీవు నన్నుఁ జంపినను, రక్షించినను, నీవే నాకు గతియని తలంచి మొన్న నారదుండరుదెంచి నీవమరలోకమున కరిగి యుంటివని చెప్పి నీకడకు రానున్న నన్ను వారించెను. ప్రాణేశ్వరా నీవు సన్మార్గవర్తనుండవై నీపదసేవ నాకీజన్మంబున నొసంగుదువా? ఆభాగ్యము నేను నోచికొనియుంటినా? (ఇంచుక యూరకుండి) నన్నుఁ జంపఁదలంచిన నీవు నన్నుఁ గరుణింతువా? నీచే నిరాకరింపఁ బడిన నేనన్నాళ్లింక యిట్లు బ్రతుకుదును? కాని, నే జీవించి యున్నంతవఱకు, నాహృదయమున నీసేవయు, నిష్కళంకతయు మఱువకుండ నున్నంతవఱకు నీకేవిధమయిన హానియు నెవరివల ననుఁ గలుగకుండుఁగాక! (దిక్కులుఁ జూచి) ఇంక నిప్పటికి దెల్లవారునోకదా! (ఆకాశమువంక జూచి)

మ॥ తనచేఁ బోషణసేయఁగాఁబడెను ప । ద్మశ్రేణి బాధింతు, నీ
వని, భావించి చిదె వచ్చె నీశ్వయుకీ నిం । ద్రైనం జనం జెల్లు నీ
కని ప్రేమ బును బూని వాసి జలజా । తారాతికిఁ దెల్పవ
చ్ఛపచంద్రుంబున వేగ మెక్కె యుదయం । బౌఁ బూర్వభాగంబునన్.

(ఇటునటుఁ జూచి శోకమూర్తి పనుల నటించి)

సు॥ ధరనీన్ జూడద్రి కాలబోధము నీ కా । ధార బు మత్కంఠసు
స్వరమే కూనొనగదా మనశ్చలిత శ । బ్దం బల్పమేయుంచు దు
ర్భర గర్వాంబెలఁగిం పు భంగిఁ బ్రియమా । రన్ కుక్కుటశ్రేణి భా
స్వరలీలన్ వినుమాయనే నదె వి । శ్వగ్రామధామంబులన్.

(ఆకాశమువంకఁ జూచి) అదిగో! శచిల్లచెలి యుదయాచలేంద్ర

వల్మీకముమీద బ్రహ్మవర్చసమయంబున విడిచిపోయిన నిర్మోక మనునట్లు తూర్పుదిక్కునఁ బ్రాచీమతల్లి జనించినది. ఇఁక నేను సూర్యోదయము గాకపూర్వమే కాలకృత్యముల నిర్వర్తించుకొని స్నానముఁజేసి భగవదారాధనయందుఁ జిత్తమును ప్రవేశపెట్టుదును గాక! (నిష్క్రమించును)

(విష్ణుమూర్తి జలంధర రూపముతోఁ బ్రవేశించును.)

విష్ణు—[తనలో] నారదుని ప్రేరేపణమున జలంధరుఁడు శివునితోఁ యుద్ధమున కరిగినాఁడు. ఇప్పుడు వారిరువురకును పోరు ఘోరమై యుండును. (ఆలోచించి) ఇఁక నేనాలోచించ నేల? ఈవేషముతోఁ బృందం జేరెదఁగాక! తన భర్త దుర్మార్గుఁడయినను నాతని కద చింతనము హృదయమునందు విడువక నిరంతరము నాతనిక్షేమము నే కోరు పరమసాధ్వి నెట్లు వంచింపఁగలనో తెలియరాదు.

(ఎదుటఁ జూచి) అదిగో! బృంద.

తే. గీ. జాగరారుణితాలోచనా । బ్జములతోడ
దంతపదశోభితాధరా । ధరముతోడ
వియదుఁలాలుచు మైలైన । కురులతోడ
నలరు బృంద మోమును జూడ । హర్ష మొదవె.

ఈమె. యిప్పుడే స్నానమాచరించి భగవదారాధనయందుఁ జిత్తము జేర్పుటకుఁ దలంచుచు సూర్యోదయమునకుఁ గాబోలు నెదురుచూచుచున్నది. (పరికించి) ఆమె యిల్లువచ్చుచున్నది. నేను నెమ్మదిగా నెదుటఁబడి నాయుద్యోగమున వర్తించెద. అహా!

తే. గీ. అఖిలలోకాధినాథుండ । నైన నేను
మొక్క యువిదపై సమ్మోహ । మూనియిట్లు
దేవహితము నవంకపై । దెలివిమాలి
వచ్చితిని సీతలోదరి । వంచనంబు
సేయ; జనము లీకార్యమీ । క్షించి నన్ను

రైశానకయుంద్రదీ యాదర్శ । కంబుగాగ
కంచెయే చేను మేసిన । గలదె దిక్కు.

[ బృంద-ప్రవేశించును. ]

బృంద—(ఆకాశమువంకఁ జూచుచు)

సీ॥ ఉరుమహోదయధరే । శ్వరుఁడు ధరించెడి,
మహనీయకోటీర । మణి యనంగ
బలభిత్కుమారుని । పాన్పుపైగట్టిన,
విన్నైన పవడంపు । బంతియనఁగ
ప్రత్యూషతరుణి, శ్రీ । రామునకై యెత్తిన
దివ్యనీరాజన । దీపమనగ
దొలిదిక్కు పూఁబోఁడి । యళికభాగమునందుఁ,
దీపించు కాశ్మీర । తిలకమనగ
తే॥ గీ॥ స్వతరుణారుణకాంతులు । భాసిలంగ
సకలజగముల నానంద । జలధిముంచ
నాత్మలోపల భావించి । యా సరోజ
మిత్రుఁడదిగో పూర్వాద్రి । మీఁదఁ దోఁచె.

(ఇట్టునటు జూచి) ఆహా! ఏమి! ఈపులుగులయొక్క విచిత్రగతులు!

సీ॥ లేమావిచిగురును । లేమ నోటను బెట్టి
ముదమునఁ దా దిను । భూరిపికము.
జంట బాయఁగలేక । సంతసమ్మున,
మనుపు సరసెడి మ । ట్టాదమిథునము
మాటికిమాటికి దన । బోటినిఁ బిల్చుచు,
మించుహర్షమునఁ జ । రించుశుకము
విడచిన నేహాని । యడరునో యని మెడ
మెడఁగలిపి తిరిగెడి జ । క్కవలజోడు
తే॥ గీ॥ ప్రకృతి సంతసిల్లిన జీవ । రాసు లెల్ల
కలిత దాంపత్యసౌఖ్యంబు । గాంచుచుండ

నాపురాకృతకర్మము । నకు మనంబు
నందు నేమని వగతు ని । ల్లితి నేను.

విష్ణు—(తనలో) ఇదియే మంచిసమయము. (కొంచెదరగా బృందను సమీపించి)

మ॥ తరుణీ! నీయెడ నేను, జేయు నపరా । ధం బెల్ల మన్నించి, స
త్కరుణావర్ష ము నాపయిం గురిపి, నీ । కౌఁగిటింగ్ఁ జేర్చి నా
వెరపున్ మాన్పుము; బుద్ధివచ్చెను మహా।విజ్ఞాన మబ్బెన్; నిరం
తరమున్ కీర్తిమునందు నాల్చెద భవ । ద్వాక్యాంబులనే సుందరీ.

చ॥ గతజలసేతుబంధమున । కై తలపోయుట పాడిగాదు; దు
ర్మతినయి నేను నిన్ బలుతె । లంగుల బాధలుపెట్టినాడ; నీ
మతి నవియెల్లబోవిడిచి । మానిని సత్కృపనాదరించి; యం
చితగతి నేలుకొమ్ము నన । నీకుమాపశ్రవిశాలలోచనా.

బృంద—(తనలో సంతోషముతో) ఆహా! నేఁటంలెయు సుదినము. భగవదనుగ్రహమువలన, నానాధునకు నాయెడలఁ గరుణ జనించినది. ఈతఁడు తానొనర్చిన యకృత్యములకుఁ బశ్చాత్తాప మందుచున్నాడు. ఈతని పదసేవ నాకు లభించుటచేసి నేను కృతార్థురాలను. (ప్రకాశముగా) ప్రాణేశ్వరా! ఎన్నాళ్లకు నాయందు దయవచ్చినది. నిన్నుఁ గరుణించుటకు నే నెంతదానను?

శా॥ రాకాచంద్రునిరాకకున్ నిరి చకో । రంబుల్ చూడఁగను శో
భాకారంబునకున్ సరోజములులే । యుత్సాహ మొప్పు నీ
రాకన్ గోము మనుచు దాన నిటు; నా । రక్షింప భావించి యా
హా! కారుణ్యము బూని వచ్చితివి ధ । న్యంబయ్యె జన్మంబిలన్.

నాథా! ఇప్పటికైన నాయందు కరుణగలిగినది. నీవుఁ నాయందు నిష్కరుణవహించి నీపదసేవకు నన్ను దూరముగఁ జేసినను, నేను నీపాదసేవ మరచియుండలేదు. నాయెడల నీవు గినుకవహించి జలరాశింద్రోయ శ్రీమన్నారాయణుని యనుగ్రహమున బ్రదికితిని.

లేకున్న నేనీపాటికి స్వర్గసౌఖ్యము ననుభవించుచునే యుందును. ఇంతకును నీచరణంబుల గొలిచి కృతార్థురాల నగుటకుఁ గాబోలు బ్రతికియుంటిని.

విష్ణు—(తనలో) ఈమె నన్ను జలంధరునిగనే భావించినది. ఇంతవఱకును నాప్రయత్న మనుకూలముగనే యున్నది. (ప్రకాశముగా)

ఉ॥ నీవు మహాపతివ్రతవు । నిర్మలధర్మవివేకశీల స
ద్భావము నీకుసొమ్ము; జన । వంద్యను నిన్ను నేనె యట్లు దు
ర్భావముఁబూని హింసలకు । బాలొనరించితి; వానిసైచి; యీ
దావహచిత్తమూని చరి । తార్థునిఁ జేయుము సుందరీమణీ.

బృంద—మనోహరా! నేను నీకరుణకు బాత్రురాలనేగాని వినుతికిఁ గాను. గడచినదానికి నీవుగాని నేనుగాని చింతించినందువలనఁ బ్రయోజనము లేదు. ఇంక మనమాసంగతి మఱచిపోవలయును.

విష్ణు—

మ॥ జలజాక్షీ! భవదీయవాక్యములనే । స్వాంతంబునం జెందకే
కలుషాంగుల్ నినుహింసఁ బెట్టితి బరా । త్మాత్ములం బట్టితిన్
గలిగో ప్రగ్రధనంబులన్ విబుధులన్ । గారించితిన్; దాపసా
వళి బాధించితి వారిసన్నిధిఁ గటా । బాధించి తత్పత్నులన్.

ఇది యంతయు నట్లుండ, ముక్కంటిచే భస్మముగాకుండ నన్ను రక్షించిన మహాసాధ్వీశిరోమణివగు నిన్ను సముద్రమునఁ గూలవైచితిని. ఈ పాపములన్నియు నన్నేవిధమునఁ గట్టికుడుపునో కదా! (విచారము నటించును)

బృంద—మనోహరా! పాపమునకు బశ్చాత్తాపమునొందువారు పాపము ననుభవింపరని యార్యులు చెప్పుదురు.

విష్ణు—భయాకలితచిత్తుఁడనగు నన్ను నీభుజపంజరమున జిక్కించుకొని వెఱపు మాన్పుము. (కౌగలించుకొనుచున్నాఁడు).

బృంద—జీవితేశ్వరా! గతించినసంగతులఁ దలంచుకొని యేల విచారించెదవు?

తే. గీ. నీపరిష్వంగసౌఖ్యంబు । నిక్కముగను
వర్ణనముసేయఁ గవికైన । వశముగాద
బోచు, బలుకంగ నగుఁగాదె । యట్టియెడల
పదము లుండునె, నాకుఁ । బద్మనయన.

[జలంధరుని శిరము వారిముందుఁ బడును.]

బృంద—(తొందరగా విష్ణుమూర్తి చేయి విడిపించుకొని జలంధరు శిరము జూచి) హా! ఇదియేమి? (మూర్ఛిల్లును.)

(విష్ణుమూర్తి నిజరూపము ధరించి నిలచును.)

విష్ణు—(తనలో) ఈవ్యాపారము తుదకేమగునోకదా.

బృంద—(విష్ణుమూర్తి నిజూచి) హా! కపటనాటకసూత్రధారీ! ఎంత మోసము జేసితివి? (భర్త శిరమును బట్టుకొని) హా! ప్రాణేశ్వరా! నీ వీప్రపంచమును విడిచిపోయితివా?

ఉ. అయ్యయొ జీవితేశ, యిటు । లైతివె? యింకను లేమిసేతు, నా
కెయ్యది యింక దిక్కు; మఱి । యెవ్వరి వేఁడుదు; రక్తసిక్తమై
యుయ్యెడ నీశిరం బకట । యీదశ బొందఁగ గాంచియుండియున్
బ్రయ్యలు గాక యుంటి లల । నల్ కఠినాత్మలు గారె యారయన్.

హా! మనోహరా! నాయెడల నీవు నిష్కరుణవహించి నన్ను బాసి నను, నీపదసేవయె చేయుచు, నాసుమంగలత కేవిధమగుభంగము రాకుండదాయని తలంచితిని. వంచకుండైన హరి భవదీయాకృతిఁ దాల్చి వచ్చుట యెఱుంగక నీవేయని భావించి నీపదదాస్యము లభించెఁగదాయని యెంతయో సంతోషించితిని. అక్కటా! నీకిట్టి దుర్దశ గలిగించిన దెవ్వరోకదా?

విష్ణు—రణమున ముక్కంటిని దాకుటచే నీగతి బొందెను.

బృంద—(భర్త నుద్దేశించి) జీవితేశ్వరా? ఇంక నేనెంత విచారించిన నేమి ప్రయోజనము!

సీ. ఐశ్వర్యమిచ్చిన । హరుడాది దేవతల్
భవదీయ చరణసే । వకు లటంచు
నీ యకృత్యములకు । నిత్యంబు భయమందు
దాపసేంద్రులు పాలి । కాపులంచు
సాధ్వీశిరోమణుల్ । సంయమీంద్రుల పడం
తులు వెలసతులతోఁ । దుల్యులంచు
భారతీనాథకృ । పాలబ్ధ విక్రమ,
శౌర్యబలములు శా । శ్వత మటంచు

తే. గీ. గర్వమును బూని యట్లు లో । కములయందు
మిన్ను మన్ను నెఱుంగక । మేరమఱచి
తిరిగినందుకు, బాపమీ । కరణి నిన్ను
గట్టి కుడిపెను తప్పునే । కర్మఫలము.

సీ. నిరంతంబు దేవతల్ । నిఖిలమానవులకు
బూజార్హులను బుద్ధి । బూనలేక
యెచట ధర్మంబుండు । నచటనే జయముండు
ననెడి వాక్యంబును । నరయలేక
తాపసోత్తములను సం । తాపింపఁ జేయుట
యే నాశనం బని । యెంచలేక
సాధ్వీమణీ తిర । స్కారమే వంశంబు
నడఁగొట్టునను మాటఁ । గాంచలేక

తే. గీ. గర్వమునఁ జరించినందుకుఁ । గలుగ మిట్లు
బండి కారణాబ్యోభవ । న్మృతికిని
సిందు కేమని వగతుమా । నేఁటి దిక్కు
నీవు లేనట్టి యీ బ్రదు । కేల నాకు.

సీ॥ పరసతీసంగమ । వాంఛయొక్కటి చాలు,
సత్కులంబెల్ల ధ్వం । సంబుసేయ
సంయమీశ్వరతిర । స్కార మొక్కటి చాలు,
సకలభాగ్యముల నా । శనముసేయ
సాధుజనసమితి । సంతాప మొక్కటి చాలు
కలితపుణ్యము లడు । గంటఁజేయ
దేవదూషణ దురు । ద్రేక మొక్కటిచాలు,
నిమిషంబులో । నీరుసేయ

తే. గీ. నక్కటా యివియన్ని నీ । యందు నమరి
యుండుటఁజేసి యిట్టి చే । టొందనయ్యె
వగచి నందున కేమి లా । భంబుగలుగు
కర్మఫల మిట్లు నిన్ననుఁ । గట్టికుడిపె.

ప్రాణేశ్వరా! నే నింక శోకముమాని ధైర్యచిత్తనై నిన్ననుసరించి కృతార్థురాల నయ్యెదగాక! (విష్ణుమూర్తిని జూచి) శ్రీహరీ! నీవు నన్నిట్లు వంచించెదవని కలనైనఁ దలఁచియుండలేదు. నా చిత్తవృత్తి నెఱింగి యుండియు నిట్టి యకార్యమున కేల యుద్యోగించితివి? ఇదియా నీ ధర్మరక్షణము!

చం॥ అనిశము దీనసంతతిని । నారసి, వారల కోర్కెఁ దీర్చు మే-
మనుచుఁగా; దుష్టదైత్యుల ర । ణంబున శౌర్యమునన్ వధించుచున్
ఘనమతి దేవతాతతినిఁ । గాచుఁగా; యక్కట యిట్లు సాధ్వినై
న ననుఁ గుయుక్తి మానహర । ణం బొనరింపగ । నౌచితో హరీ.

దీనివలన శ్రీహరి, పరాంగనాహరణదూషకుఁ డని వచ్చు నింద కన్న, మఱియొక లాభ మేమి యుండఁ దలంచితివి?

విష్ణు— నారీమణీ! నిఖిలజగజ్జేగీయమానంబగు భవదీయ సౌందర్యము నకుఁ జిక్కితి నను సంగతి నీ వెఱింగి యుంటివి. అది యట్లుంచుము. ప్రస్తుత మీ కార్యము నిఖిలామరమునిజనార్థమై నాచేఁ జేయఁ బడినది. తాపసపత్నుల బలిమిఁ బట్టుచు, దానవులకు సంతోషము కలుగఁజేయుచు, దేవతలకుఁగూడ బాధగలిగించుచున్న నీ నాథుఁ

డింతవఱకును నీ సాధ్వీత్వమువలన నేకీడును బొందక యున్నవాడు.

తే. గీ. చాన! నీ మది నెక్కింత । చంచలతను
గలుగఁజేసితి నేని ము । క్కంటివలన
నాలమున నీదు నాథుండు । గూలు ననుచు
నిట్టిమాయఁ బన్నితి దేవ । హితముకొఱకు
గినుక నొందకు నాపైనఁ । గీరవాణి.

జగద్ధితార్థమై నేనొనర్చిన యీకార్యము నింద్యముగాక యుండుఁగాక! సాధ్వీమణీ వగు నీ యశమున కావంతయుఁ గళంకముండకుండు గాక! నాకు నీయందుఁ బ్రీతియుండుటంజేసి నీ వఖిలలోకంబులచేఁ బూజింపఁబడెదవుగాక?

బృ. ద.— మాధవా! పరాంగనల వంచించుటయేనా నీవు దేవహితము కొఱకు నేయుకార్యము! ఇదియేనా! నీధర్మసంధత! ఇదియేనా నీ భక్తరక్షణము! నాథరత్నమృతికే దుఃఖింతునా? నీవొనర్చిన యకార్యమునకే వగతునా? ఎట్టి దుష్కార్యము జేయుటకు సాహసించితివి! సాధ్వియని యెక్కింతయైనఁ దలంపవైతివికదా! దేవహితార్థమై పరాంగనలమానభంగము నొనరింప దలంతువుగా! ఆహా! ఏమి! నీభువనపరిపాలన దక్షత! నీకీ యాధిపత్యము లభించుట యంధ్యంబులం దుంకు కర్దమునకు వటీరాద్రివాసము లభించినట్లును, పాషాణముల మ్రింగు పారావతమునకు రత్నరాశి లభించినచందముననుఁ, గ్రామతటాకాంతరంబున వర్తించు కొంగకు మానససరోవర విహార మమరిన మాడ్కిని, ముఱుగుకుబొందులఁ దిను జంబుకంబునకు మత్తసామజము తలమెదడు జేకూరినకరణిని నున్నది. (కోపముతో). సాధ్వి నగు నాయెడల నట్టి యకార్యమాచరించి, మదీయాగ్రహంబునకుఁ బాత్రుండవైతివి. జాజ్వల్యమానదావజ్వాల లక్రమంబుగ హరింప వచ్చును. కఠినసంచార ధుర్య కాకోలగుళికలు మ్రింగవచ్చును. నానా జగజ్జాలనాశనప్రక్రియోజ్వల మృత్యువుతోనైనను బెనంగి గెలువవచ్చును. యమదోఃప్రకాండదీవ్యద్భండదండంబునైనను విఱువ

వచ్చును. కాని సాధ్వీమణుల కాగ్రహము గలిగించి తదీయ శాప వాక్యాగ్నిజ్వాలలందు బడకుండ నెవ్వరును దప్పించుకొనజాలరు.

విష్ణు—(తనలో) ఈమె నాకు శాపమిచ్చునాయేమి?

మ. విరిబోడీ! యిటు లాగ్రహింప నగునే । బృందారకుల్ వేడ;నీ
కరణిం జేసితి వారికిన్ హితముగా । గతి దీనిచే నీ మనో
హరుఁడీల్గెన్ విను ముందు నొక్కనికిఁ గీ । ర్తైనన్ లభించున్ మహో
త్కరికిన్ మేలిది నీ వైకుంఠపురిలో । కంబందు నీ మార్గముల్.

బృంద—ముకుందా! అవ్యక్తవాక్యంబులచే నేల సమర్థింపఁజూచెదవు? నాకుఁ బతివియోగముం గూర్చి దుఃఖ ముదవించినందులకు నీవు దీనికిఁ దగినఫల మనుభవించకపోవుదువా? ధర్మము దప్పి చరించిన పిదప నీవు భగవంతుఁడవైన నేమి? మహత్తరుఁడవైన నేమి? ధర్మసంరక్షణార్థమై మానవతులను భంగమొనరింపఁదలంచుట యా నీగుణము! సాధ్వీమణుల కాగ్రహం బొదవెనేని, వారించుట కెవ్వరుజాలుదురు? నిశ్చయమైనసాధ్వి కాగ్రహం బొదవెనేని యొక్కపెట్టున సమస్తజగత్ప్రళయము సంభవించునట్లు జేయఁగలుగునని తలంపుము. నీవొనర్చిన యాకార్యము నాహృదయమును దహించివేయుచున్నది. కానిమ్మ ఇందులకుఁ బ్రతిఫలముగా నీవు పాషాణంబవై యుండుము.

విష్ణు—హా! హతోస్మి. (రాయిగా మారును.)

బృంద—(దేవతల నుద్దేశించి) ఓ యింద్రాదిదేవగణములారా! రణమున మదీయనాథుని గెలువఁజాలక యిట్టి కపటము పన్ని కలుషం బాచ్ఛి పఁదలంచి శ్రీహరి నాకడకు బంపిన దుష్టచిత్తులగు మిమ్ము నిరాగ జేసినను నాకోపము చల్లారదు. మాధవుని నొకవేషధారిఁ జేసి యీవంచననాటకము ప్రదర్శింప సాహసించితిరి.

[ఇంద్రుఁడు బ్రహ్మతో ప్రవేశించును.]

ఇంద్రు—(బృందను గాంచి) సాధ్వీమణీ! మన్నింపుము. దేవతల యెడల నట్టి సాహసము సేయవలదు.

బ్రహ్మ—(రహస్యముగా) మహేంద్రా! రోషావేశంబున నీ సాధ్వి జగత్కర్తయగు ముకుందుని పాషాణముగా జేసినది. మనము నెమ్మదిగా నీమెను ప్రసన్నురాలుగఁ జేసికొనవలయును లేకున్న భర్తృసంతాపపీడితయగు నీమె యేమి చేసినను జేయగలదు.

ఇంద్ర—(బృందను జూచి)

సీ. వసియింపు మాచను । వక్షంబునిచ్చిన,
పతివీడి యుండఁదు । బరఁగు లక్ష్మి
యర్ధశరీరంబు । హరుఁడీయఁ; జూడక,
చండియై చరియించు । శైలతనయ
మొగమునం దుంచినన్ । మగనిని వీడి దో,
వక్షసన్నిధి నుండు । చాన వాణి
నత్తి నక్కాంచకో । నిన నాథు విడనాడి,
పంకమున దొరలు । వనిత గంగ
తే. గీ. నీకు సాటి రారంచును । నిక్కముగను
జాటి చెప్పెద వేయేల! । సాధ్వి నీదు
దివ్యమహిమంబు గనులకుఁ । దెల్లమయ్యె
హరిని శిలగాఁ గావించి । యలరినావు.

బృంద—(ఇంద్రునిఁ జూచి) ఏమి! నీ నక్కవినయము! అందిన జుట్టును, నందకున్న గాళ్లను బట్టుట యను సామెత నీయందు నిజమగుచున్నది. భగవంతుండగు లక్ష్మీకళత్రుని నన్ను వంచించు దుష్కృత్యమున వర్తించ నీవే ప్రేరేపించి, మదీయ శాపమునకుఁ బాత్రుండగునట్లు చేసితివి. తాఁ జెడిన కోతి వనమెల్లఁ జెఱిచె నన్నట్లు మొదటినుండియుఁ బరాంగనల మాచించు మాయోపాయధురంధరుఁడ వగు నీ విట్టి యుపదేశములనే యొరులకుఁ గూడ జేయుచుందువు.

ఉ. మారుని బాణకోడి యభి । మానము గోల్పడి గ్రామకుక్కుటా
కారముఁ బూని కూతనిడి । గౌతమపత్నికిఁ జారుశీలకున్

జారుఁడవై దురంతమగు / శాపమునొంది సహస్రయోనిసం
భారము మేనిపైఁ గనిన / పాపరతుండవు నీవు గావొకో.

మ. కకుబంతాధిప దివ్యరత్నమకుటా / గ్రస్థాపనీ భూతభీ
తికరోద్దీపితశాసనుండవు మహా / ధీరుండ వైయుండి జం
కక పాపంబున కింతయొడ్డి గమలా / కాంతున్ సమున్ జేరి వం
చకమున్ జేయుమటంచుఁ బల్కితివి; దు / ష్టాత్ముండ వీ వారయన్.

ఇంద్రుడు—(తనలో) నే నేమియుఁ జెప్పక పూర్వమే యీమె నన్ను నిందించుచున్నది. ఇంతటితో నూరకొనునో లేక, నన్ను గూడ శాపతప్తునిఁ జేయునో.

బ్రహ్మ—(బృందం జూచి.) సాధ్వీమణీ! ఆగ్రహింపక నా పలుకు లాలింపుము. నీకుఁ దెలియని ధర్మ మొకటును లేదు. పుండరీకాక్షుం డిట్టి కార్యము తాపసజనసంతాప నివారణార్థమై చేసె నను సంగతి నీ వెఱుంగుదువు. నిరంతరమును మాధవుని చిత్తమున సేవించు నీవే యాదేవాదిదేవుని నీలీల శపింపనగునా? అతఁడు లేకున్న జగముల గతి యేమగును?

బృంద—దేవా! భారతీరమణా! అధర్మోద్యోగమున బ్రవేశించి నా భర్త మృతికి గారణమై నాకు వైధవ్య మొదవించినప్పుడు నా కీ జగములతో నేమిపనియున్నది? ఎవరు త్రవ్వుకొన్న గోతిలో వారే పడుదురు. సాధ్వినగు నన్ను వంచింపదలంచి మధుసూదనుం డట్లు శాపము నందె. దీని కెవ్వ రేమిసేయుదురు?

[లక్ష్మీదేవి—ప్రవేశము.]

లక్ష్మి—(తనలో) బృందకడకు వచ్చు నాథుని, నిట్టి కార్యము సేయ వలదని యెంతచెప్పినను వినక వచ్చి తుదకు సాధ్వీమణియగు నామె శాపంబునకు బాలయ్యెను. అక్కటా! ఇప్పుడు నే నేమి సేయుదును? (పరికించి) బ్రహ్మేంద్రులుగూడ భయమంది, యామె

తో సంభాషింపఁజాలక యున్నవిధము తోఁచుచున్నది. ఇఁక నేనే యామెను వేడుకొందుగాక. (బృందను సమీపించును.)

బృంద—దేవీ! పద్మాలయా! భగవంతుని యెడల నేను మహాపరాధ మొనర్చితిని. నన్ను మన్నింపవలయును.

లక్ష్మి—బృందా! నీవు సాధ్వివి. సాధ్వీతిరస్కారమువలన నా నాథుఁ డట్లయ్యెను. జరిగినదానింగూర్చి చింతపక, నా యందు గరుణాంతరంగవై పతిభిక్షఁ బెట్టుము. శ్రీహరి లేని వైకుంఠంబున నే నెట్లుందును? అది యట్లుండ సకలజగంబులును సంతాపసాగరంబున మునుంగును.

బృంద—అమ్మా

చ. వనజభవాదిదేవగణ । వందితుఁ డీ హరి యాతఁ డప్పుడా
ర్చనమునకంచు నాఁడు నిత । రంబగు కృత్య మభీప్సితోపపా
దన మది లేదు నిక్క మిది । తల్లి! సమస్త మెఱింగియుండియున్
వనజదళాక్షి నీగతి ను । నర్చితి చేర్చితి నీకు దుఃఖమున్.

జననీ! నామూలమున నీకుఁగాని జగములకుగాని సంతాప మొదవనేల? నాభర్తృశిరముతో నగ్నిం బ్రవేశించెదగాక! అంతట నీ ప్రాణేశ్వరుఁడు నిజరూపము ధరించును. (బ్రహ్మేంద్రులను జూచి) పితామహమహేంద్రులారా! నే ననలప్రవేశ మొనర్చుటకు దగిన యత్నము గావింపుఁడు.

(బ్రహ్మేంద్రులు - నిష్క్రమింతురు.)

బృంద—(లక్ష్మీదేవిం జూచి) జననీ! నా కనుజ్ఞ నొసంగుము. సాధ్వీమణులకు భర్తయే దైవము. కావున నేను పతిమార్గము ననుసరించుచుంటిని.

లక్ష్మి—సాధ్వీ! సాధ్వీలలామవై, గర్వించు నారీమణులను దలయెత్తకుండ జేసి, నన్నును, నగజాతను, భారతినిఁగూడ మించిన నీ పవిత్రచరి

త్రము, మహామహిమయు ననమానము. అమ్మా! సాధ్వీ! పతిభక్తికి మించిన పుణ్యము కంటెఁ బ్రపంచమున మరియొండు లేదు. సాధ్వీ ప్రభావమునకు సాటియైనది లేదు. తల్లీ! నీ చరిత్రము నారీమణుల కెల్లరకును నాదర్శకమగుగాక!

బృంద—(పాషాణమైయున్న విష్ణుమూర్తింగాంచి కరములు మోడ్చి)

సీ॥ అఖిలజగన్ని । యామకుండవ యున,
మాధవా! నీ దివ్య । మహిమ లెన్న
భారతీపతికైన । వశముగా, దట్టిచో,
నజ్ఞానురాల నే । ననఁగ నెంత
ప్రాణుల వేడ్కతోఁ । బాత్రలుగాఁ జేసి,
జగ మను రంగ దే । శంబునందు
నాటలాడించుచు । నలరు మహానుభా
వుడవైన నిన్ను సం । పూర్ణకోప,
మున నట్లు శిలగఁ గ । మ్మని పల్కినంత నే;
బృంద సాధ్వి యనెడి । పేరుఁ జగతి
నిలుపంగఁగాబోలు । శిలరూపు సివిధి
గరిమఁ గైకొంటివి । గాక యున్న
లోకేశ్వరుఁడ వైన । నీకు నే శాపంబు,
నొసఁగు టేమి! యది నీ । వ్రంచు టేమి!

తే॥ గీ॥ ననలమున జొచ్చెద । నీవు తొంటి
దివ్యరూపంబు ధరియించి । తేజరిలుచు
నఖిలజగముల నేలుచు । నలరు మింక
సాధుజనరక్ష! శ్రీవక్ష । జలరుహాక్ష!

(నిష్క్రమించును)

లక్ష్మి—ఆహా! ఈమెచరిత్రము సర్వజగద్విఖ్యాతిఁ బాత్రమైనది. (ఎదుటఁ జూచి) అదిగో! బృందనాథునిశిరం బగ్నిం బడనైచి తామగూడ నందు బ్రవేశించినది.

(శిల - విష్ణురూపముగా మారును.)

విష్ణు—బృందా! బృందా!

లక్ష్మి—ప్రాణేశ్వరా! ఏమిది!

విష్ణు—బృంద యెక్కడ? బృంద యెక్కడ?

లక్ష్మి—అదిగో! శ్మశానమున గతించిన నాధునిచితి నగ్నిం బ్రవేశించినది.

విష్ణు—(ఎదుటఁ జూచి) హా! బృందా! బృందా!

(నిష్క్రమించును)

లక్ష్మి—అక్కటా! బృందపై నీ మహానుభావున కీ పరితాపమేమి? నేనరిగి, నెమ్మదిగా నాధుని వైకుంఠమునకు దోడ్కొనిపోయెదఁగాక.

(నిష్క్రమింతురు)

ఇది పంచమాంకము.



# సతీతులసి.

## షష్ఠాంకము

---

[కైలాసమున సతీదేవియు, ఇంద్రుఁడు, బ్రహ్మయుఁ బ్రవేశము.]

సతి—(బ్రహ్మేంద్రులను జూచి) బ్రహ్మేంద్రులారా!

శా. ప్రాతఃకాలనితాంతధూసరశశి ప్రాయంబులై మీ ముఖా
బ్జాతంబుల్ కళజాఱియున్నగతి గా స్పష్టంబ నన్ జూపె నీ
భ్రాంతిం రాఁబని యేమి? యంతటి మహా వైక్లబ్యసంప్రాప్తి యే
రీతిం గల్గెను మీకు దెల్పుఁడు ధృతిన్ స్వీయచిత్తముల్ బూనుచున్.

ఇంద్రుఁడు—జగజ్జనని వగల నీకుఁ దెలియని విషయ మున్నదా! పరమేశ్వరునిచే ఖండింపఁబడిన జలంధరుని శిరముం గని సాధ్వియగు బృంద యగ్నిం బ్రవేశించినంతనే నాఁటి శాపమునఁ బాషాణమైన శ్రీహరి నిజరూపమును బొంది బృందకై పరితపించుచు శ్మశానమున విహరించుచున్నాఁడు.

బ్రహ్మ—దేవీ! శతకోటి దినకర ప్రతికోటి దురవలోక స్వీయతేజస్సమాక్రాంతంబును, చంద్రసూర్య తారాసంఘటకర ప్రాసాదసౌధహర్మ్యవ్రజంబును, సకలశిల్పరచిత గేహవ్యూహ నిర్వ్యూహమణిఘృణిపూరితాంబరతలంబును, శోకమోహతృష్ణాపిపాసాజరామృత్యువర్జిత ప్రాణిగణంబును, నగు వైకుంఠము శ్రీహరి లేకపోవుటం జేసి కళఁ జెన్నుఁ దఱిగియున్నది. ఇందిరాదేవి సంతాపచిత్తయై యున్నది. కావునఁ గరుణం బూని పద్మాలయామనోహరుఁడు వైకుంఠమును బ్రవేశించు మార్గము నరసి, లోకసంతాపమును బాపుము.

సతి—తే॥ గీ॥ అఖిలదేవాదిదేవుఁడై । యలరు నాథ
నొక్క యువిదకై తాపంబు । నొందుటేమి
యమ్మహాత్ముని మహిమంబు । లరయ
నేరికైనను శక్యమే । యెంచిచూడ.

బ్రహ్మేంద్రులారా! నేనొకవిధముగ బీజము నొసంగెదను. ఇట్లే మీరు లక్ష్మీసరస్వతులయొద్ద గూడ గ్రహించి, భగవంతుఁడగు శ్రీహరియున్న బృంద శ్మశానవాటికయందు నాటుఁడు. నా వలన గ్రహింపబడి మీచే నాటఁబడు బీజము, బృందప్రతిరూపమై తులసి యనుపేర బఱగి విష్ణునిమోహ పరితాపమును బోఁగొట్టును.

ఇంద్రు—మహాప్రసాదము.

పార్వ—ఇదిగో! (బీజమునిచ్చును)

ఇంద్రుఁ—అంబా! ఇట్లే లక్ష్మీసరస్వతులవలనఁగూడఁ గ్రహించెదము.

బ్రహ్మ—దాక్షాయణీ! ఇఁక మేము పోయివచ్చెదము.

(తెర వాలును)

రంగము (2) [శ్మశానభూమి:—ప్రవేశము-విష్ణుమూర్తి.—]

విష్ణు—(ఇటునటుఁజూచుచు,) ఆహా! శుష్కపలాగ్రతాగ్రనిశితకంకక్రోష్టృగృధ్రౌఘజనితధ్వానంబును, నుత్కటీకృతశిరోజాతప్రతానంబును, దుర్గంధనిదానంబును నగు నీ శ్మశానం బెంత భయంకరముగనున్నది? ఇందు విహరించుట కాపార్వతీనాథునకే తగియున్నది. (బృందనుద్దేశించి) హా! బృందా! నీపై మోహము నన్నింతకు దెచ్చినది? శతసహస్రాహస్కరోజ్జ్వలమై, విద్యుల్లతికావదాతవివిధోద్యద్వైజయంతీయుతమై, వేదశిరోధరద్విపప్రముఖ దేవాగ్రేసరోపాసితంబైన యావైకుంఠమున నుండక నేను నీపైఁ బరితాపమున నిట్లు భూతప్రేతపిశాచ ఢాకినీగణంబులకు విహారభూమి యగు నీ ప్రేతభూమి యందుఁ జరించుచుంటినిగదా!

తే॥ గీ॥ పూవుబోడి! శరత్కాల / పూర్ణశశికి
వంకలంబెట్టు నీముఖ / పద్మ మకట
నకట యగ్నిలోఁ ద్రేల్చుట / కాత్మ యెట్లు
సమ్మతించెను లోచను / సారసాక్షి.

చ॥ లలితమృణాలపల్లవ వి / లాసము మించెడు బాహువల్లి యు
జ్జ్వల దనలంబులోఁ దిగఁగ / న్గాంతము సమ్మతిబొందె నెట్లు హా!
జలజముఖీమణీ! భువన / జాలము లన్నియు వేడ్కఁ గుక్షిలోఁ
గల నిను గొన్న నాకె బలు / వంత ఘటించఁ దగఁ జాలి తెంతయున్.

తే॥ గీ॥ నేల నొక్కింత నడచిన / నలత! యరుణ
కాంతివహించు భవదీయ / చరణకమల
యుగ్మ మగ్నిలోఁ గాలుచు / నుండఁ జూచి
యోర్చియుంటిని దుఃఖంబుఁ / జేర్చి మదిని.

సాధ్వి వైన నీయశశ్చంద్రికలు చతుర్దశభువనములయందును గాయ జేసికొంటివి. నాచిత్తమునమాత్రము సంతాపము నాటితివి.

(బ్రహ్మయు-నింద్రుడు-ప్రవేశింతురు)

ఇంద్రు—(బ్రహ్మను జూచి) దేవా! భారతీరమణా! శ్రీహరి స్థితి యే రీతిని నున్నదో చూచితివా?

బ్రహ్మ—ఈమహాత్ముని దర్శించి సంభాషించెదముగాక (విష్ణుమూర్తిని సమీపించి)

సీ॥ అలవికుంఠనగరి / నలుగుమోమెదు నిన్ను
ప్రేతభూమిని విహా / రించు టేమి
సన్మునుల్ భజియింప / సంతసించెడు నీవు
భూత భజనచేతఁ / బొంగు టేమి
ఫణిరాజశయ్యపైఁ / బవ్వళించెడు నీవు
పల్లకాటిని నిట్లు / బరుగు టేమి

భక్తుల దుఃఖంబు । బాపుచుండెదు నీవు
భూరి దుఃఖాబ్ధిలో । మునుఁగు టేమి
తే॥ గీ॥ జలజవాసిని రాణివై । పాలఁగాచుండ
బృందకై పరితాపంబు । బొందు టేమి
రమ్ము వేగ వైకుంఠపు । రమ్ము జేర
కమలదళనేత్ర! నన్నను । గన్నతండ్రి.

ఇంద్రు —

సీ॥ జలజాలయాదేవి । సతి, పద్మజుఁడు పట్టి
భారతి కోడ; లీ । శ్వరుఁడు హితుఁడు
ఫణిభోజనుఁడు తేజి । ఫణిరాజు తల్పంబు
వందిజనములు తా । పసగణంబు
క్షీరోదకీసంద । కసుదర్శనంబులా,
యుధములు ఘనశంఖ । మొత్తు బూర
యమర సంతతి సేవ । కావళి; యక్షులు
సోమభాస్కరులు; కౌ । స్తుభము భూష
తే॥ గీ॥ ఇం; బ్రహ్మాండంబు మేను; స । ముద్రంబు గృహము
భక్తచిత్తంబులు విహార । వనము; లిట్టు
వెలుఁగుచుండిన నీవొక్క । రికి కొఱకు
దాపమందుట మిగుల చో । ద్యంబు గాదె.

దేవా! నీకై రమాదేవి మిగుల బెంగఁగొని నీవు లేకుండుటచే వైకుంఠంబుఁ బ్రవేశింపకయున్నది. సత్వరముగా విచ్చేసి మాకందఱకును మోదంబుఁ గొల్పుము.

బ్రహ్మ—తండ్రీ! బృందకై యింకఁ బరితాపము విడువుము. నీ పరితాపమును బాపుటకు మేము సతీదేవివలన నొక బీజమును గ్రహించి యీప్రదేశమున నాటితిమి. అయ్యది బృందకు ప్రతిరూపమై తులసియనఁ బరగు. దానిఁ జూడుమా

విష్ణు—బృందప్రతిరూపకమా? ఏది! ఏది!

(తెర లేచును)

[తులసీభూజముండును]

బ్రహ్మ—దేవా! వీక్షింపుము.

విష్ణు—(సంతోషముతో) ఆహా! ఏమి! (బృంద నుద్దేశించి) హా! బృందా!

తే॥ గీ॥ పడఁతి! నాదు సంతోషంబు । బాధ వెట్టి
మాడ్కి సతి కృశన్ దులసిగా । మాఱితివి
భళిర! నాకును బ్రియమైన । వస్తు వగుట
నీవు మునిజనాధిపులచే । నఖిల జగము
లందు పూజలఁ గాంతు వా । నంద మెసఁగ.

సీ॥ దినకరోదయమును । గని సంతసించు కను,
రాణించు పద్మాక । రంబు వగిది
సంపూర్ణపూర్ణిమా । చంద్రుని రాకను గాంచి,
రంజిల్లు రత్నాక । రంబు మాడ్కి
వాసంతలక్ష్మికి । లాసోదయంబున
వికసించు నుద్యాన । వీథిభాతి
వార్షుకు రాకకు । హరను సంతోషంబు;
నొందుచు నుండు మ । యూరి మట్లు
తే॥ గీ॥ నీ మహోదయంబున నాకు । నిక్కముగను
బరమహర్షంబు గలిగెడు । దాపు వాసె
సకలజనంబులఁ బూజల । నందుచుండి
తులసి యను పేర నొప్పుచుఁ । జెలఁగుమింక.

బ్రహ్మేంద్రులారా! ఈ తులసీమహోదయమున నేను స్వస్థ చిత్తుఁడ నైతిని. ఇంక నేను వైకుంఠమును బ్రవేశించెదను, కాని

మీరు మాత్ర మొక కార్యము సేయవలయును. ఈతులసిని బృందావనమునఁ బ్రతిష్ఠింపుఁడు.

ఇంద్రు—ఆజ్ఞ నెరవేర్చెదము.

బ్రహ్మ—మహేంద్రా! భగవంతుఁడగు శ్రీహరి స్వస్థచిత్తుఁడయినాఁడు. ఇఁక మనకు గావలసిన దేమున్నది?

ఇంద్రు—

సీ॥ జలజాక్షి యగు బృంద । సాధ్వీత్వ మతివల,
కాదర్శకం బౌచు । నలరు గాక
హరికిఁ బ్రీతియగు నీ । నలరు తులసి సతము,
సద్గృహంబులందునఁ । దనరుగాక
శ్రీనాథు ప్రీతికై । చిరభక్తి తులసిని,
జేరి యాదటను బూ । జింత్రుగాక
తులసి నర్చించి, ని । స్తుల సౌఖ్యభోగసం,
పదలు మానవులు గాం । చెదరుగాక

తే॥ గీ॥ తులసి యుండు ప్రదేశమం । దు హరికూడ
యుండి; భక్తజనులఁ బ్రోచు । చుండుగాక
జగము పావనంబుగ నెంచుఁ । బడెడు తులసి
దళము ప్రతివారు శిరములఁ । దాల్త్రుగాక!

బ్రహ్మ—తథాస్తు. (తెర వ్రాలును.)

ఇది షష్ఠాంకము.

సర్వము సంపూర్ణము.

---

"సువర్ణపాత్ర" నాటకమునకై మీరు

వెంటనే కార్డు వ్రాయుడు.

వెల రు 1-2-0

నవకవితా కార్యస్థానము,

బందరు. (కృష్ణాజిల్లా).